# ఆవృతం





భమిడిపాటి కామేశ్వరరావు



ప్రతిష్ఠ
కొండపల్లి వీరవెంకయ్య అండ్ సన్సు
శ్రీ సత్యనారాయణ బుక్ డిపో
రాజమండ్రి

వెల
రూపా

మొదటి ముద్రణం, ఏప్రిల్ 1930
రెండవ ముద్రణం, 1942
మూడవ ముద్రణం, జనవరి 1947
నాల్గవ ముద్రణం, జనవరి 1952

శ్రీ కొండపల్లి ముద్రాశాల
రాజమండ్రి

# విషయసూచిక

# మేష్టరీకూడా ఒక ఉద్యోగమేనా?

[ అసలు ఈ వ్యాసము 25-3-25 నాడు, రాజమండ్రీ ట్రైనింగుకాలేజీలో వార్షికోత్సవానికి చదివే ఊహతో వ్రాసింది. కాని ఆరోజు కాలేజీలో తత్—దినమే జరుగలేదు సరి, ఇది చదవడం పడలేదు. మళ్ళీ సాంవత్సరికానికి—అనగా; ఈయేడు మార్చితో ఇదిఅక్కడే చదవడానికి ఏర్పాటూ జరిగింది; కార్యక్రమంలో ఒక విషయంకిందా ఎక్కింది. ఎక్కితేం? ఇతర విషయాలమూలాన్ని దీనికి టైము లేకపోయి, దిగింది. మనలో మనమాట, ఆ యితరవిషయాలు ఏమిటనుకున్నారు? కేవలం, ఫలహారాలు స్మండీ! ఆ తరవాత, ఏప్రిల్లో ఇది వీరేశలింగంస్కూల్లో పాతవిద్యార్థుల సమావేశానికి ఊరికే స్మాల్ కాజుగా చదవడం అయింది. అయితేమి! ఇది నేను ఆట్రైనింగు కాలేజీలోనే చదువుతున్నానని చూడండి, ]

అగ్రాసనాధిపతికీ, సభాసదులకూ, నమస్కారములు.

ఇంతఉత్సాహముతో, ఇన్నిసట్టుదలలతో, ఇన్నివందలమంది జ్ఞానభాస్కరులు బాలుర అజ్ఞాన తిమిరాన్ని పటాపంచలు చెయ్యడానికి శుభ మల్లే, తయారవుతూన్న, అయిన, ఈసందర్భంలో, అట్లాతమాష చెయ్యడానికి వీరకంకణంకట్టుగున్న ఆలయమంటపమైన ఈస్థలంలో మేష్టరీకూడా ఒకఉద్యోగమేనా అనే వ్యాసం చదువుతాను. ఇంతమంది గొప్ప

మేష్టర్ల సమక్షమున నేను మేష్టరుపదవిని గురించి అవాకులూ, చవాకులూ, మాట్లాడాలని రాలేదు. మేష్టరీగురించి సమంజసంగా మాట్లాడడానికి ఏ డాక్టరో, ఏ లాయరో, అధమం ఏ మేష్టరేతరుడో అయితే బాగుండేది; కాని ఈర్ష కొద్దీ మాట్లాడారని అనిపోతారనో, లేక దీనికాపాటి ఔన్నత్యము లేదనో, మరేమి కర్మమో కాని, దీన్ని ఊరికే లాంఛనానికి ఏదో గొప్పదే అంటూండడం తప్ప తభిసీలుగా దీని ప్రమేయం ఎవ్వరూ రానివ్వరు. పైగా సాధారణంగా ఎవరి గొడవ వారిది. అందువల్ల నేను మేష్టరైనా-ఏది?- నేను మేష్టరైనా—మేష్టరీమీద కొన్ని అభిప్రాయాలు మీతో చెప్పడానికి తెగిస్తున్నాను, ఓపట్టాన్ని మేష్టర్లు దేనికీ తెగించకపోయినా. స్వవిషయం నిర్మోహమాటంగా చెప్పడం కష్టమని నాకు తెలుసు. అదీగాక, మనసంగతి మనకొక్కరికీ తప్ప కడమఅందరికీ తెలుస్తుంది అన్నాడు ఒకాయన. కాని మనసంగతిపూర్తిగా మరోడికీ తెలియదు సరిగదా, మనకు తెలిసినదారి ఒకటీ, తక్కిన ఎల్లరకూ తెలిసినది మరొకటీ గాని, మనకు ఏమీ తెలియదు అనడం కూడా బేసబబే! ఏమైనా, నేనేదోపరాయివాణ్ణే అనుకొని జనబాహుళ్యంలో మేష్టరీగురించి ఉండేఅభిప్రాయాలూ, మరికొన్ని ఇతరమైనవీ మీతోమనవిచెయ్యాలని నా తాత్పర్యం. అవి మనం తెగవింటూంటాం. అవి నిజం. నిజం అనేది ఎన్ని పెట్టెల్లో పెట్టి బిగించి తాళాలువేసినా నేనూ ఉన్నానని మళ్ళీసిద్ధ

మవుతూంటుంది. అందుకని, ఇవి నేను చెప్పకపోతే మరొకరైనా చెప్పితీరతారు. మరొక్క విశేషం. ఇవి ఇప్పుడు మీరు వినేటప్పుడు, ఎక్కడైనా నూటికీ కోటికీ చిరునవ్వు రావచ్చు ఒకవేళ. ఎంచేతంటే, సరిగ్గా ఉన్న వి ఉన్నట్టు నిజం విన్నప్పుడు మనకు నవ్వురావచ్చు "సడమేష్మీ" అని పించి, అలాంటప్పుడు, ఆనువ్వు న్యాయమైనదనిన్నీ, దానిలో అప్రతిష్ఠ ఎంతమాత్రం లేదనిన్నీ, అది మేష్టర్నిగాని. మరి ఏ ఇతరుణ్ణిగాని నిరసన చెయ్యడంవల్ల పుట్టించినది కాదనిన్నీ జ్ఞాపకం పెట్టుగోమని సభవారిని కోరుతూ, ఇంతటితో ఉపోద్ఘాతం కట్టేస్తున్నాను.

ప్రతిదాన్ని గురించీ ఎల్లాగో, అల్లాగే మేష్టరీ గురించి కూడా అభిప్రాయభేదాలు బహుదట్టంగా ఉన్నాయి. ఇతర దేశాల్లో అన్నివిషయాలా అభిప్రాయాలూ, భేదాలూ కూడా ఎక్కువేకాని, మన దేశంలో భేదాలుమాత్రమే విశేషం. పైగా, ఈయొక్క అభిప్రాయభేదానికి, అనగా త్యాజ్యానికి, ఉండేపరిమితి అపారం. మేష్టరీ చాలా ఉత్కృష్టమైనది కొందరు జ్ఞానులు ఉద్దేశంట. అది చాలా చవట పనని చాలామంది ఇతరుల ఉద్దేశంట ఇందుకనే హాస్యం బయలుదేరడం. ఇది ఎల్లా ఉందంటే; వెనకటికి ఓ మేష్టరు గారు, కుర్రాడు అల్లరి చేశాడూ అనుకున్నప్పుడు "Stand there you D. D." అనేవాడు. అప్పుడు కుర్రాడు తప్పుచెయ్యడం ఒప్పుకోంటూన్న మొహంపెట్టి నిలబడితే,

"కూర్చో, నిన్న మరేమీ అనలేదు. Doctor of Divinity అన్నాను" అనేవాడు కాక, కుర్రాడు ఇంకా తెగసాగుదుగా నిలబడితే, "D. D. అంటే తెలుసునా? Doct. of Divinity అనుకుంటున్నావేమో కాదు పొట్నా, Doubl Duffer అన్న మాట" అనేవాడు అయనే చెప్పాడు, తనకి పుట్టింటే మహా అయిష్టంట. తన ఒక స్నేహితుడితో మాట్లాడుతూ, "అబ్బ! ఏమి దుర్వాసనండీ, ఎల్లా కాలుస్తారోగాని" అన్నాట్ట. అంటే, అవతలాయన గబగబా పైకి ఎగపీలుస్తూ "ఆహాహా! చుట్టతాలూకు పరిమళం ఏం పరిమళమండీ!" అనేవాట్ట. అలాంటప్పుడేకదూ వ్యాపారం ఏదైనా హాస్యాస్పదం కావటం! మేష్టరీ బహుపవిత్రమైనది అని కొందరు, 'బతకలేకపోతే బడిపంతులు అని జనవాక్యం పోవయ్యా!' అని కొందరు. అదీగాక, మామూలుగా ప్రయాణాల్లో, ఒకర్ని, పక్కవాడు, "అయ్యా, మీ దేవూరు?"; "మీకేమన్నా ఉద్యోగమా?"; "ఆ"; "ఏం ఉద్యోగమండీ?" "మేష్టరు" అని వినీవినడంతోటే వాడు చప్పరించేసి పెదవి విరవడం, పక్క మొహం పెట్టడమూనూ. అనగా, వాడి ఉద్దేశం, "ఇవతలవాణ్ణిలా కెక్కిళ్ళి పైవాడు మిక్కిలి ఘనములైన పదవుల్లో ఉంచి చూడగా, వీడు వాట్లల్లో తోలీకైనా మార్లేమగావునూ, అప్పుడామట్టున 'స్థిరోభవ వరదోభవ' అని చెప్పి ఈతణ్ణి ఈ మేష్టరీలో పడేశాడు!" అని. "ఏదో వట్టి నూనె విత్తాయి సరుకులాంటి నాసిరకం అయి ఉండక

పోతే మేష్టరీలోకి ఎందుకు సిద్ధమై ఉంటారు!" అని దీని పైన, 'బతకలేకపోతే భాగోతం' అని మరోముక్క వింటూంటాం. బడిపంతులు చర్యంతా భాగోతంఖత్తు అనేమో బోధనకీ బొమ్మలాటకీ ఇంత సంబంధం కలిసింది. ఈ పాపత్యానికి తార్కాణం కూడా ఎప్పుడేనా దొరుకుతూంటుంది లెండి. ఆ మధ్య ఓ ఊరు నలుగురు ఆసాములు వచ్చారు స్వగ్రామంనించి. వచ్చి చూడవలసినవన్నీ చూసేసినవాళ్ళవడంచేత, వాళ్ళు నాటకంలో చేరడానికి సకలప్రయత్నాలూ చేశారు. కాని, వాళ్ళగానం, ఇక్ష్వాకుల పూర్వంది అవడం చేతకాబోలు వాళ్ళని అందులోకూడా చేర్చుకోకపోగా వాళ్ళు మరీ చిట్టచివరకి అమాంతంగా, గోవిందా అని చెప్పి, మేష్టరీ ట్రైనింగులో చేరి ఊరుకున్నారు. అల్లాంటి వాళ్ళవల్లనేమో జనుల్లో ఈ అభిప్రాయం. ఒకానొకప్పుడు, ఒక రెవరైనా పెద్దచదువు చదువుకుని, తీరా మోసి పట్టి మేష్టరీ, చేస్తూంటే, అది విని, విచారంతో, పెద్దమనుష్యులూ, పరిచయులూ, బంధువులూ అతనితో మాట్లాడుతూ ఇన్నాళ్ళూబతికి అన్నట్లు, ఇన్నాళ్ళూ చదివి చివరకి మేష్టరీలో చేరావేమిట్రా, ఆడదీ కాకుండా మొగాడూ కాకుండానూ? ఒకటోరకమైన ఇతర ఉద్యోగాలు వచ్చినన్ని ఉంటూంటే, ఇదేమిట్రా బోడిఉద్యోగం? హాయిమంటూ ఉండను, రిజిస్ట్రీలో జేరకపోయావట్రా, బాబూ! కించిత్తూ రొష్టు లేకుండా పుచ్చుగోవచ్చుగా రెండుచేతులా! ఇచ్చేవాళ్ళకి నష్టంలేదు, నీకు లాభం. మధ్య

వస్తు లుంటార్రా. నువ్వేఅగవ్! పైగా, ఒక్కనాటికి రాదు మాట. ఏమంటావా? జస్తుసంగతి ఇంటిదగ్గిరే, దస్తావేజులు కచేరీలోగాని, రేటు తాతాచార్లవారిముద్ర, తలకాయకి తల కాయ్. మరోవిశేషం; నిత్యాపఃటరా. ఎందుములుగుల్తోనిమి త్తంలేదు. పోనీ, ఓరిశీల్లో జేరితే, మనఊళ్ళో! ఎంతసౌ ఖ్యం! (అంటే, ఆ చేరడం అంతా వీడి ఇష్టంలోఉన్నట్టు) నౌకావాసం; ప్రతినిత్యమూ చెక్కరకేళీలు; కాలవగట్టున ఎక్కడ పనసపిండెప్పట్టినా, మీాయింట్లోనే ఉంటుంది. ఏమను కున్నావోగాని! కాలవతూముతీసి నీళ్లు వదిలావా, ఎంతమేర పొలం తడిసిందో, అంతమేరా పరవరట్రా రూపాయలూ, చాలనేవరకూ, వృష్కలంగానూ! ఇందులో ఏముంది మ్రొ త్తికా? అన్నింటికీ మొహంవాచిపోవాలి. ఏంపనిజేశావు! అయితేనూ జీతం ఏమాత్రం ఓరి?” అంటాడు. అంటే అతడు ఏమైనభైరూ అంటాడనుకోండి, రివైజ్డ్ స్కేల్ ప్రకారం రివైజ్డ్ స్కేలు 8౦-10-30 (క్రిందికి)–ముప్ఫైకే దొరుకు తాడుకాదూ మరి బియ్యే ఇప్పుడు! అంటే, అవతల వారు, “ఉన్నదిబస్తీగదా, ఒరీ, సాలుకి ఎనభై ఏం కిట్టుబడినీకు!” అంటారు. అనగా, పామరుల అభిప్రాయం మేష్టరీ చెయ్యడా నికి బ్రతికిఉన్నవాడు అనగా చేతులో నాడి అందుతూన్న ప్రతీవాడూ పనికొస్తాడు గదా అని. అల్లాంటిపనికి జీతం నెలకే ఎనభై కావడం వాళ్ళబుద్ధి చచ్చినా ఒప్పుకోక, అది సాలుకి చాలని అనుకొంటూంటుంది. మేష్టరీ చాలా ఉన్నతమైనదీ,

విశిష్టమైనదీ అని దారుణస్తోత్రం చేసేవాళ్ళు, తమరికి దీని యందు ఎంత అభిప్రాయం ఉన్నా, తమరు ఉండకూడదట మేష్టర్లుగా. అంటే, ఇతర ఉద్యోగాల్లో ప్రస్తుతం ఉండే చాలామందికి, ప్రత్యేకంగా ఒక్కొక్క శాఖలో తెగ పండిపోయిందిట తెలివి. అందువల్ల మేష్టరీ చెయ్యడానికి ఎవరో మామూలు వాళ్ళు కొందరున్నారుగదా అని తమరు ఇతర ఉద్యోగాలు స్వీకరించారట, దేశముయొక్క లెవెల్ ఎక్కువచేసి, ప్రజలకు వచ్చే యిక్కట్లను ఆదుకోడానికి. ఇలాగంటి కారణాలవల్లనే "మేష్టరీకూడా ఒక ఉద్యోగమేనా!" అని సందేహాస్పదంగా పెట్టవలసివచ్చింది దీనిపేరు.

ఎల్లాగైతేనేమి, 'మేష్టరీ ఉద్యోగమేనా' అని చర్చించేటప్పుడు, మొదట, ఉద్యోగం అంటే మానవుల సంకల్పం ఏమిటో చూడడం కర్తవ్యం. ఉద్యోగం అంటే గొప్ప యోగం పట్టడం. కాబట్టి గొప్ప పని. చాలామంది అభిప్రాయం శరీరంకంటె బుద్ధేగొప్పది అని కావడంవల్ల గావును కాయకష్టంకంటె తలపనే గొప్పదా అనుకోవలసివస్తూంటుంది. కాయక్లేశపడేవాడికి బుర్రబాధ ఎంతమాత్రం ఉండదుకాని, బుర్రప్రయోగం చేసేవాడికి ఎంచేతో గాని శరీరకార్శ్యం ఉంటుంది. అంచేత, తలపాగాగల ఉద్యోగం గొప్పదేమో! ఈ రెంటిలో ఉత్కృష్టం ఫలానా అని చెప్పడం సాహసం. ఏమైనా, జనసమూహంమీద కొంత అధికారం చలాయించి, వారికి జీవితంలో కలిగే అవసరాలసందర్భంలో

కలిగే అవసరాల సందర్భంలో ఉపకారమో అపకారమో చెయ్యటానికి వీలైన అంతస్థులో ఉండడమనేది ఉద్యోగం. కేవల ప్రాపంచికమాత్రమైన అప్పు ఆస్తులూ, రాబడి పోబడులూ గురించి, జనులు యావన్మందీకూడా ఒకడు తమన్ని ఏమిచేసిపోతాడో అని హడలుతూన్నప్పుడు ఆ ఒకడుచేసేది ఉద్యోగం అంటారు. రాజసత్త ఉంటేనేకాని ఘనమైన ఉద్యోగమే కానేరదు. సమృద్ధిమైన వేతనం జోరుగా ఉంటూన్నకొద్దీ గొప్ప అంతరం ఉద్యోగంలో. జీతం ఎక్కువగా ఉండగానే సరికాదుట మళ్ళీ; అది రోజూరోజూ ఇస్తే కూలి అయిపోతుందిట; నెల నెలా జీతాలు తెచ్చేవే ఉద్యోగాలు, అని. కొందరు కూర్చోడానికి కుర్చీ, కాళ్ళు తన్ని పెట్టడానికి బల్లా, వీలైతే పంకాగాలీ, కలిగి ఉన్నవన్నీ ఉద్యోగాలన్నారు. మొత్తంమీద ఉద్యోగాలు సంఖ్యాపరంపర లాంటివి. ప్రతీ సంఖ్యకీ పైన మరోటి ఉన్నట్టు ప్రతీ ఉద్యోగానికీ పైన ఇంకోటి ఉండి తీరుతుంది. అంటే ప్రతీ ఉద్యోగస్థుడూ, కిందవాళ్ళని కొందర్ని ఆరుమూడు చెయ్యగలిగితే పైవాళ్ళకి కొందరికి ఆయిమపది చేసితీరాలి. నెత్తిమీద వాళ్ళు ఎంతతక్కువమంది ఉంటే అంత గొప్ప ఉద్యోగస్థుడే. కొంతదర్జా, కొంతదాబూ, దర్పం, పలుకుబడీ అవీ ఉంటేనేకాని ఉద్యోగమే కాదు అదీకాక, బిళ్ళబంట్రోతులు ఉండాలిట, డవాలీలు అపసవ్యంగా తొడుక్కుని, "అస్మత్ పితుః ప్రాచీనావీతి" అన్నట్టు. ఆ డవాలీ పల్లెటి దిక్కు-

వాళ్ళని బెదరకొట్టడానికీ, నాటకం వగైరా శాలల్లోకి టిక్కెట్టు లేకుండా ప్రవేశించడానికీ, ఆలస్యంగావచ్చినా సభల్లో అగ్రస్థానం అలంకరించడానికీ, బల్లకట్లు ఊరికే దాటడానికీ, పడవల్లో ఒకటోనెంబరు గది ఖాళీచేయించడానికీ, బహు ఉపచరిస్తుంది. మరిన్ని బదలాయింపులు ఉండి అప్పటప్పట సర్కీటు వెళ్ళవలసిన అగత్యం ఉండేది ఉద్యోగం. ఎల్ల వెన్నులు మూట గట్టుకొని శరీరం నిమిత్తం అనగా తిండీతిప్పలూ, వేషం, ఫోషక్, పిట్టల్లో అయ్యే తగులుబాట్లకికూడా ఎవరిమీదో విరుచుకు పడడానికి వీలుగలది ఉద్యోగం. కొందరు ఉద్యోగులు పల్లెల్లో పోగవుతూంటారు, పైవారికి జమచూసుగోడానికిట. అటువంటప్పుడు అక్కడ జరిగే ఖర్చుపద్దు వ్రాయడానికి చిత్రగుప్తుడైనా పనికిరాడుగదా. ఆఖర్చు చేసేవాళ్ళకి ఆవరకే ముట్టిందిట పదింతలు — లెక్కలేదు. అనుభవించేవాళ్ళకి లెక్కతోనే జరుగుల్లేదు. మనడబ్బు కాకపోతే మనం బహు విరివిగా ఖర్చు పెట్టగలం! కాఫీహోటలుకి మనమే వెడతే "రెండు వడలూ, అరకప్పుటీ, ఇనఫ్. ఊహూ, ఎందుకూ అంతకంటె" అనడం. ఇంకోడికి గెస్టుగా వెడితే, మననిమిత్తం పెసరట్లకోడూ, ఇడ్లీకోడూ కేటాయింపుగా జనం కూర్చుని మరీ తయారుచెయ్యాలి. అందుకని దేశం మీద సమర్థుచెయ్యడం ఉద్యోగం. పైపెచ్చు, కార్యకరాదులు చక్కావచ్చినప్పుడుధనధాన్య సమృద్ధిగా కావలసినన్ని అరటిగెలలు,

కూరలు, పాలు, పెరుగు, బియ్యం దేకీలు తెగసప్లయి అయి పోయేది ఉద్యోగం! కొందరు ఉద్యోగులు, అల్లాంటి సరఫరా బాపతులోది తమకు కావలసినది ఏదో కకూర్తిగా వాడుకుని, తక్కినది మర్నాడు కూర్లబజార్లో అమ్మించి డబ్బు చేసుకోవడం చాలామందికి తెలిసినదే. అందువల్ల, పైన ద్దారికే దేదో అదే ఉద్యోగమని ఘరానా మనుష్యుల ఊహ. ఈ పైనదొరకడం అనేది మహాగుసుముగ్గా. దాన్నే కొందరు కిట్టనివాళ్లు తేలిగ్గా "ఆఁ లంచం" అంటారు. మరికొందరు, "ఆ ఉద్యోగిని చావమన్నావా ఏమిటి? అవతలవాళ్లు వచ్చి, బతిమాలుకోని, మిక్కిలి సంతోషపూర్వకంగా, తమ అవసరం నెరవేర్చినందుకు మీద పారేసిపోతూంటే, ఆ ఉద్యోగిని పుచ్చుకోక ఏంజెయ్యమన్నారు? అతడేమీ వెళ్ళి అడగలేదు. అడిగితే, ఎవరయ్యా ఇచ్చేదీ? తోచివ్వాలిగాని! అల్లాటప్పుడు పుచ్చుగోనివాడు వాజమ్మ. అందుకనే, కొందరు రివిన్యూలో జేరితేం? మడి కట్టుగుని కూర్చున్నాం అంటూంటారు. "ఫలానావాడు అంత మంచి లైనులో ప్రవేశించాడు. ఓ ఇరవై యెకరాలు ఏకఖండిక అంటిది ఆర్జించాడూ? అల్లా కట్టుగా ఉండడం ప్రజ్ఞా, లౌక్యమా, పోదూ?" అని పెద్దపెద్దవాళ్ళు అనగా వింటూంటాం. అందులో, జీతంకాక, పైన సంపాదించిన తోటాదొడ్డీ, ఇల్లూ వాకిలీ బట్టే ఉద్యోగికున్న తెలివియొక్క దారుణత్వం, అఖండత్వంపై వారు మామూలుగా కొలుస్తూండేది. చాలా లం

చాలు పట్టే వాడికేట ప్రమోషను. ఎంచేతంటే వాడు మరీ పై వాళ్ళకి లెక్కాపత్రం లేకుండా పారెయ్యగలడుట. ఈపైన దొరకడాన్నే కొందరు బహు శ్రోత్రియంగా, గాంభీర్యంతో, 'బల్లకింద చెయ్యి,' 'చెయితడి' 'రశ్మి' అని వాడుతూంటారు. పైగా ఆపనిలోంచి నిష్క్రమించగానే, ఆ మనిషి కేవలం కోరలూడిన పామల్లా అయిపోకుండా, కాస్తో కూస్తో పింఛను కలిగి ఉండేదే ఉద్యోగం. ఇంట్లో శుభకార్యానికి గాదు, పితృకార్యానికి గాదు, దేనికేనా సరే, "మా వాడికి సెలవు దొరికింది కాదుట, రాలేదు" అని ఇంటిదగ్గిరవాళ్ళు అనుకోవలసి వచ్చేది ఉద్యోగం. ఇంటిదగ్గిర పిల్లాపీచూ, ఒకణ్ణి. 'నాన్నా' అనకుండా, 'నాన్నగారూ' అనిపిలుస్తూంటే, వాడు ఉద్యోగే. ఇంగ్లీషులు నేర్చినవాళ్ళ అభిప్రాయం, ఇంగ్లీషులో చేసేదే ఉద్యోగమని కాని, పామరుల ఉద్దేశం—పామరులు అంటే గ్రహపాటువల్ల ఇంగ్లీషు రానివాళ్ళన్నమాట—తెలుగులో చేసిందికూడా ఉద్యోగమనే. ఇందుకనే చెబుతూంటారు, పెద్దలు,—"వెనక, నాచిన్నతనంలో ఈ ఇంగ్లీషులన్నీ ఏడికాయిటోయ్! కోరటులో వాదనలూ తీర్పులూ అన్నీ తెలుగునే టకటకలాడిపోయేవి. ఫలానావారు రాజమేంద్రీలో జడ్జీగా ఉన్నప్పుడు మన ధర్మ శాస్త్రాన్ని పురస్కరించుగుని వ్రాసినతీర్పు:—

"ఇవతలవేపు న్యాయవాదీ, అవతలవేపువాడూ, బల్ల బద్దలుకొట్టి, ఒకరిమీద ఒకరు అగ్నిహోత్రంలా అయి

పోయి, కొట్లకుక్కల్లాగ కలియబడి జుట్టూజుట్టూ పీక్కోగా, చివరకి తేలిన సారాంశం ఏమిటంటే" అంటూ ఉండేదిట. ఆయన చేసిందిమాత్రం ఉద్యోగం కాదూ!" అని.

ఏదైనా వాహనం ఉంటేగాని ఉద్యోగం కాదని ఒకాయన. వాహనం అంటే, భగవంతుడు ప్రసాదించిన కాళ్ళతో కాక, కూర్చున్నవాడు కూర్చుని ఉండగానే, ఒకడు (బతికిఉన్న ఒకడు) తన ఉద్యోగస్థానం చేరడానికి సాధనం. అందుకు పెట్టిపుట్టిందే ఉద్యోగమని. వాహనాలు కలిగి ఉండడానికి బృహజ్జాతకంలో!

చంద్రసూర్యావిలగ్నేషు బలవద్గ్రహాత శ్శుభే,
పాపాయుక్తేచ సశుభే యోగోవాహనసంజ్ఞితః.

అనిన్నీ,

ఆగ్నేయమర్కే కటశ్చ సాశ్వం
చంద్రే త్వథాప్యం సవృషంచ వాహనమ్,
భౌమోయథార్క శ్చ సితో యథేందు
ర్బుధేతు మిశ్రంచ గజాదికం గురౌ.

అనిన్నీ ఉండడంవల్ల, గుఱ్ఱాలబండీ, ఎడ్లబండీ, ఏనుగే. ఇచ్చట చెప్పబడ్డాయి. 'గజాదికం' అన్నచోట ఆదిశబ్దం ఉందిగనక కడమవన్నీ ఆముక్కగర్భంలోనే ఇమిడిఉన్నాయి అని వాదించవచ్చు—పైగా గజం చాలా పెద్దదికూడాను. కాని, సైకిలు, మోటారు, రైలు, ఎలెక్ట్రిక్ రైలు, విమా

నం, రిక్షా—అనగా అనంతిసేనం!-బోటు, ఓడ వగైరా బోలెడువాహనాలు ఉద్గ్రంథాల్లో స్మరణేనా లేకుండా పడి పడున్నాయి అంచేత ప్రస్తుత జాతకాలు కొన్నిపరీక్షించి From the particular to the general ప్రకారం

సితేందు మోటారు కారెందుసైకిల్

సితభామమిశ్రంచ రిక్షాచ ట్రామ్ కార్

లాంటిప్రమాణాలు చేసి పెద్దగ్రంథాల్లోకి ఈపాటివెక్కింం చెయ్యాలి సాహసించి. లేకపోతే ఇల్లానే ఉంటూంటుంది. ఇవన్నీ పూర్వోక్త వాహనాలుకావు పొమ్మంటూంటాడు ఎవడైనా! మరోముక్క. కొందరు తమ స్నేహితుల వాహనంలో చక్కాపోవడం కద్దు. దీనికి అనుగ్రహం కాక ఏ ఇతరగ్రహబలం ఉండాలో విమర్శించాలి. సరి, వాహనంగాక, బిరుదులు, దర్శనం ఓ పట్టాన్ని దొరక్కపోవడం, చిట్టచివరకి నాలుగురూపాయల ప్యూన్నైనా సరే నియమించడానికి పవర్ గలిగి ఉండడం వగైరా లక్షణాలు మిక్కిలిగా ఉన్నాయి ఉద్యోగానికి. నిరంతరదాస్యాలైనవే ఉద్యోగాలైనప్పుడు పరమ స్వాతంత్ర్యం, స్వేచ్ఛా కలిగినవి ఉద్యోగాలనడానికి ఆటంక ముండకూడదని కొందరి మతం.

ఇక మేష్టరీకి ఈ లక్షణాలు సంధించి చూడక పూర్వం ఏ ఉద్యోగపు చదువు మంచిది? అని జనుల్లో అనుకునే ప్రసంగం కొద్దిగా చేద్దాం. ఒక్కొక్క కాలంలో ఒక్కొక్క ఉద్యోగపు చదువు ఫాషన్‌లో ఉంటుందిట. ఫాషన్ అంటే జనుల

నవ్యాభిరుచులనుబట్టి వేషాదికంలో ఉండే భేదవిశేషం. కొత్తఫాషను ఎంతబుద్ధి లేనిదో పాతదికూడా అంతబుద్ధి లేనిదే సరిగ్గా, కాని పాతఫాషన్ అంటే నవ్వొస్తుంది ఏమో గాని, కొత్త వారికి—మరీకొత్తఫాషన్ వారొచ్చి తమర్ని చూసి గుక్కలట్టేవరకూను! ఈ ఫాషన్‌ల చొప్పున మార్పులు సూచిస్తూండే వారిదీవా భూమియొక్క నాజూకు తనపుభారం తమ భుజాలే మోస్తున్నాయని. ప్రపంచంలో కడపవాటికి మల్లేనే ఉద్యోగమూను. పైమీద వేసుగోడా నికి ఆమధ్య పెద్దజరీ అంచుకండవా, కొన్నాళ్లు నేతసరుకు, తరవాత సిల్కు, ఇప్పుడు అత్తాకోడలూ అంచు నేలంకం దువా, సిల్కుది. (షరా:—అంతా ఖద్దరు డ్రెస్సయినా దానికిమాత్రం ఎగ్జెమెషన్‌ట), ఆమధ్య మొగాళ్ళకి మురు గులూ, దుద్దులూ, దండకడియాలూ, బిళ్ళల మొల్తాడూ, తాళంచెవిగొలుసూ, కొన్నాళ్ళు ఏమీలేకపోవడం, మహా ఉంటే ఏదో ఉంగరం ఉండడం. ఇటీవల తెల్లరాళ్ళూ ఎర్ర రాళ్ళూకలిసి చెక్కి కొంచెం వదులుగా ఉండి ముంజేతిమీద పడుతూండే బంగారపుగొలుసూ, కుడిచేతికి. కొందరు అం దులో ఆ రాళ్ళు తమపేరులో ఉన్నఅక్షరాల్ని స్ఫురింప జేసే ఆకారంలో తాపిస్తున్నారట, పేరు మీదుగట్టినట్టు. ఈమధ్య లగ్గసరికి అయినపెళ్ళిళ్ళజోరులో ప్రతీపెళ్ళికొడుకూ అలక పానుపుమీద దీపికోసమేట పట్టట్టడం. నాచిన్న తనంలో వీథిపాటల్లో 'అల్లుడా మేనల్లుడా' ఉండేది. తర

వాత 'ఏదిరా నాసీత'; పదపడి 'చల్ మోహనరంగా'; ప్రస్తుతకాలంలో "అపనాతనామనా" అనేదితోచనీకుండా హోరెత్తగొడుతున్నారు సజీవులైవున్న జనం మాత్రం- అంటే పుట్టేసినవాళ్ళూ కడుపులో ఉన్నవాళ్ళూను. ఆరీతిగానే, షరీ ఆమధ్య రివిన్యూలో జేరితేనే చాలని; కొన్నాళ్ళు క్రీడట తలకాకట్టెట్టయినా సరే ఓరి సీలు పరీక్షకెళ్ళాలని; కొన్నాళ్ళు రిజిస్ట్రేషను చేసి తీరాలని—అళంగుదాకా నంచీ చిమ్ముతూ అయినాసరే వెళ్ళి! సూత్రంలో రైలైతే రైలుఇలాకా మంచిదే అని కొంతకాలం; ఇంగ్లీషు వైద్యం చదవడం కొన్నాళ్ళు; అంటే, ముందస్తిగానే, వైద్యబృందం వెలువడి అదివరకు ప్రపంచంలో ఎవ్వరూ ఎరగని కొత్తవ్యాధులూ, కొత్తపిపీలికలూ, వాటికి లాటిన్ నామధేయాలూ సృష్టించి ఆ దరిమిలాని వైద్యం చెయ్యడం. పదపడి, బొంబాయి కేసి వెళ్ళి వర్తక సరళి చదవాలని. ఇటీవల చెన్నపట్నం స్కూల్ ఫైనల్కి అప్పీలుకోసం కలకత్తా ప్రయాణమూ, అక్కణ్ణించి మిత్రమండలి ధైర్యంతో వెనక్కి మళ్ళడం ఫాషన్ అంటొచ్చారు. ఏమాత్రం పైసా ఉన్నవాడైనా, బియ్యే అవడంతోటే as a matter of course లా కాలేజీలో జేరడం ఫాషన్ - అంటే శ్రీమంతులికి లా చదువు నిత్యవిధి లాంటిది. లా చదువుకీ ఏయుగంలోనూ కాలదోషం లేదుట. మేష్టరీచదువు ఏ కాలంలోనూ ఫాషన్లో ఉండేటట్టు కనపడదు. సాధారణంగా ఇతర్ల వాటిల్లో

తెగ "ట్రై" చేసి, ఎక్కడాకూడా చేపకపోతే, మరిచేసేదిలేక హైసరమజ్జాఅని ట్రైనింగులోచేరి, తరవాత మేష్టరీ సంపాదనకోసం దేశాటన చెయ్యడం కొందరు మానవులకి పట్టిన అదృష్టంలా కనిపిస్తోంది, కాకపోయినా, చదువుకున్న పెద్దలుకూడా, ట్రైనింగు అయే మేష్టర్ని ఇల్లా అడుగుతూంటారు! "ఏమండీ, మిష్టర్, మీరు ఈ దిక్కుమాలి ట్రైనింగులో జేరారేమిటి, జీనియస్ రాట్ అవడానికి?" అని. అడిగితే, "ఏముంటోనండి; Circumstances permit చెయ్యలేదండి, Something is better than nothing, ట్రైనింగు అయిఉండడం ఎందుకేనా మంచిదండి" అంటారట కొందరు, "కడమవాళ్ళకైతే చేతిచిలుం వదుల్తుంది, దీనికయితే ఏదో కొంతవరకు మనోవర్తి పారేస్తారుగదా, దాంతో తిండి వెళ్ళిపోతుంది, విశేషించి దూరాభారం వెళ్ళక్కర్లేదు. రాజమండ్రీ, గౌతమీతీరం, పోనీ ఏదో కొన్నాళ్ళు గోదావరీస్నానం, ఈ నీళ్లు ప్రాప్తం ఉన్నాయిగావును" అన్నారట. నే చెప్పేది వెనకటి మాట. అప్పుడైనా, అంతర్యాల్లో ఉండే ఊహలట అల్లాంటివి, పైకి ఇవెవ్వరూ ఒప్పుగోక ఓపట్టాన్ని. బోధయుందు తమరికిఉండే ఆయొక్క ప్రణయం కొద్దీ ట్రైనింగు అవుతున్నాం అనేవారట. నిజంగా ట్రైనింగువల్ల మేష్టర్లుతయారు కారని ఎవరెంతనమ్మినా, బోధన అంటే గురి ఉండి తరిఫీయతు అయేవారు ఉండచ్చుస్మండీ ఎప్పుడూ కూడా.

అవునా, జనాభిప్రాయాన్ని అనుసరించి, ఉద్యోగానికుండ వలసిన లక్షణాల్లో మేష్టరీకి ఒక్క లక్షణమూ లేదు. ఓం ప్రథమం, ఇందులో పైన ఏమీ దొరకదు. ప్రపంచంతో నిమిత్తం లేదు. అందుకని రశ్మి లేదు, గొడుగు లేకుండా స్కూలు కెడుతూంటే సూర్యరశ్మి తప్ప. కడం ఉద్యోగాల్లో చేరడం నిచ్చెన ఎక్కడం, మేష్టరీలో చేరడం డాబా యెక్కడం. మరి పైకి ఎగరడానికి వీల్లేదు. ఇటూ అటూ చలించడం మొదలిడితే, అసలే క్రిందపడడం. దీనికి ఎదుగూ పొదుగూ లేదు. అంటే ఇది గొట్రిశోకలాంటిది! ఇన్నిస్ పేట బ్యాండు లాంటిది. మన 'అపనాతనామరా' లాంటిది. బంట్రోతులు ఉండరు. ఏమీ సప్లయిలు కావు. పలుకుబడి ఉండదు. పెరుగుతూండే ఖర్చులు కడిగి యిచ్చే మొద్దంకిజీతంలోనే భరించుకోవాలి. మాట్లాడకూడదు. మాట్లాడితే త్రికరణశుద్ధి లేకపోవడం అన్నమాట. శుభాశుభాలు ఆజీవితంలోనే; లిప్టన్ అందులోనే; ఎలిఫెంటు అందులోనే; రోగాలూ రొచ్చులూ అందులోనే; దేవుడు ఖర్చూ దెయ్యాలఖర్చూ అందులోనే సంసారం అంతా అందులోనే. దేశం అందులోనే. ఆస్తులు లేని వారసు తద్దినాలూ అందులోనే; బేవారసు తద్దినాలూ అందులోనే; ఒక్కటే వాహనం సాధారణంగా, పెద్దది. అన్నీ సెలవలే— ఎందుకూ? ఈస్థితి ఆలోచిస్తూ కూర్చోడానికి, అంతా పిల్లలే, కాని, మేష్టరీపట్ల దారిద్ర్యం అబ్బుతుందా? లేక దరిద్రు

పైన తరవాతే మేష్టరీలో చేర తాడా? అని సందేహించారు కొందరు. ఎటుబడితే అటే వాదించవచ్చు; అసలువాదించ డం అంటే ఏమిటో తెలిస్తే అన్నాడో కాయన. 'దరిద్రుడు' అంటే రెలిటివ్‌గా సుమండీ. జగత్తంతా ఆయొక్క 'రెలి టివిటీ'యేకదండీ! ఏమైనా, మనం చెప్పలేం; మనజ్ఞానం చాలా పైకి ఎగురుతూంటుంది కాని, కొండొకచో "హాల్టు" అవు తూంటుంది. అల్లాంటప్పుడు ఏమిటి చెప్పడం? వెధవవాళ్ళకి తీర్థవు రాచ్చిప్పలకూడ ఆపేక్ష ఎంచేత? దోమలకి మాన వుల చెవులంటే సరదా ఎంచేత? అల్లానే, దారిద్ర్యానికి మేష్టరీ అంటే ఇష్టం. అందులో తెలుగుమేష్టరంటే పరమ ప్రీతి. అతడెప్పుడూ నోట్లు(ఆఫ్ లెసన్సు అంటారు వాట్ని) వ్రాస్తూండడం ఒకతార్కాణేమో అందుకు.

మేష్టరీ పామరులకి ఉద్యోగంలా నే కనబడనిదిఅయినా పదశక్తివల్ల మనం అనుకునే ఉద్యోగాలన్నీ దీల్లో ఇమిడి ఉన్నాయని ఋజువు చేస్తాను చూడమన్నాడు మరోకా యన! అని, మొదలెట్టాడు. మేష్టరు- డాక్టరు; తరుచు రోగంకుదర్చడమే కాక, అంతకంటే తరుచు చావ కొడు తూంటాడు గనక. మేష్టరు—ప్లీడరు; దీనికి మేష్టరీ ప్లీడరీ రెండుకూడా తిరిఫీయుత్తై మారకుండానో, లేక ఒకదాన్లోంచి ఒక దాన్లోకి మారో, ఎదో ఒకటిచేస్తూన్నవాళ్ళు కొంత సాక్షి. అదీగాక, మేష్టరు ప్లీడరికి మల్లేనే తలకాయలు మారుస్తాడు. ఎటొచ్చీ, ప్లీడరు ఒకరితలకాయ మరొకరికి

మార్చగలడు: "హారిమైసాది శిరంబు సాదిమెయి జాత్య శ్వోత్త మాంగంబు" అన్నట్టు, మేష్టరు ఒకతలలోనే మార్పు తేగలడు వెనకటికీ ఇప్పటికీ!- మార్పు, అయితే మంచికీ, లేకపోతే చెడ్డకీ. పైగా, మేష్టరు జడ్జీలాగ తీర్పులు చెప్పి, పోలీసులాగ చోరీలుపట్టుగుని మేజిస్ట్రేటులాగ దండించి జరిమానా వేసి, కలెక్టరులాగ వసూళ్లు చేసి (జీతాలు) కుర్రాడి మనస్సుమీద ఎంత అధికారమేనా కలిగివున్న వాడవును. తిట్టడానికీ, దీవించడానికీ, మెచ్చుగోడానికీ నిరసించడానికీ అన్నింటికీ ఒకడేగనక కొందరు కుర్రాళ్ళకి మేష్టరు దేవుడు; చాలా మందికి దెయ్యం. చివరకి, ఆయన అన్నది మేష్టరీ చిన్నసైజులో 'సర్వజ్ఞత్వం' అని.

సరే, జీతంకాక మేష్టరీలో ఉన్న ఇతర లబ్ధిచూసేసి, చివరకి చక్కావద్దాం. ఒకటి: పుస్తకాలు చెయ్యటం. పుస్తకాలువ్రాసీ, నాటకాలుపెట్టీ, కార్లువేసీ బాగుపడ్డవాళ్లు బహు అరుదు. పుస్తకాలవ్రాతలకి ఒకానొకచో కోర్టుదర్శనం కూడా అవుతోంది. రెండు: పెద్దపరీక్షల పేపర్లు దిద్దడం అది సౌఖ్యమో, యమబాధో చెప్పడం కష్టం! జీవితంలో ఒకసారి పడ్డమేష్టరు మళ్ళీ పడడు సాధారణంగా మసీదుగం లాగ. అదైనా, యావన్మందికీ అందుతుందా? దానికెన్ని మారాముళ్లూ? బ్రాహ్మణాబ్రాహ్మణ సమస్య, అందులో ఏముందిగాని ఉత్తరాది, దక్షిణాదిసమస్య తీవ్రంగావుండి, ఉత్తరాది అంటే సిఫారసు ఉత్తరాలు వగైరా; దక్షిణాది

అంటే దానోపాయం వగైరా, కొందరికి అయితేం. మూడు: పరీక్షలకి "సూపరింటు" అవడం. రెండుమూడు రోజుల కూలి నాలుగైదుమాసాల్లో పొందడం. ఈలోపున హెచ్చు తగ్గు పరిశోధనలు చేస్తే, వెంటనే దవడ శుద్ధీ, ఇంకా పైముండి మేడలాంటివి దిగవలసివస్తే దేహశుద్ధీ రుచిచూడ్డం. నాలుగు: ప్రతి చోటా ట్యూషన్ ఒక మార్గం. మేష్టరీలో అన్నీ విపరీతాలే. గవర్నమెంటు ఉద్యోగి అయినా సరే, లా, వైద్యం లాంటి కొన్ని శాఖల్లో అయితే ఫర్వాలేదుట, ప్రైవేటుగా ప్రాక్టీసుచేసుగోవచ్చుట స్వంతానికి. మేష్టరీలో అయితే, బోధనకి వచ్చేటప్పటికి నవ్యతచెడిపోయి మరీ బాగుండే బోధన సిద్ధించదట; ప్రైవేటు వ్యాపారాలు ఎంత మాత్రం కూడదట. మేష్టరు ఏంజెయ్యాలో, ఎల్లా చెయ్యాలో, అడ్డమైన మనిషీ శాసించేవాడే, ఈ మేష్టరీ పురాకృతం ఏమోగాని, అల్లాంటిట్యూషను— అనగా బోధనావ్యభిచారం–ఒక వేళ కూడినా, ఎంతడబ్బు 'లాగు' తున్నాడో చెబుతూ దరఖాస్తు పెట్టుగోవాలిట. ఏమీ పుచ్చుగోకుండా, ధర్మార్థం పనికొచ్చేకుర్రాడు గదా అనుకుని ప్రైవేటుగా చెప్పినా, దానికీ దరఖాస్తు కావాలి. దరఖాస్తు లేకుండా ఆఖరికి ధర్మమేనా చెయ్యడానికి వీలులేకపోవడం ఒక మేష్టరీలో కనపడుతోంది. ఇంత అపనమ్మకం మేష్టరుమీద ఉంచి, "మీ కేముండి హాయిగాను, మీ వృత్తి చాలా 'నోబిల్' అని పెదవులతో అనేసి కన్ను గీటు

తూండడం మేష్టర్ని తృప్తిపరచడం కాదు. "ఉంటే ఎంతైనా ఇవ్వవలసిందే, నీ కింతకంటె జీతం ఎక్కువ ఎందుకు? రూపాయిలు ఏం జేసుకుంటావు? నువ్వెళ్ళిపోతే నీ జీతంతో నీతాతల్లాంటివాళ్ళని ముగ్గుర్ని కొనుక్కుంటాం" అనే మోస్తరికి దిగి మొదటి ఖర్జాయింపుల్లోనే మేష్టరీ శుద్ధ వర్తకవ్యాపారమైపోయి నప్పుడు, "మేష్టరు త్యాగం చెయ్యాలి. చేస్తే వాడివంటికి చాలా మంచిది, బోధన "ఐడియల్" గా—అనగా భూమిమీద లేనిదానికి మల్లే ఉంటూండాలి. ఇదంతా ఉచితంగా మేష్టరుచేస్తే మంచిదని మా అభిప్రాయం" అని అర్థంలేని పురమాయింపులు చెయ్యడం అనాలోచితం కాదూ? మేష్టర్ని సర్వాధికార్ని చేసి, 'అయ్యా, నీచిత్తం నాభాగ్యం,' అని చేతులు హృదయ పూర్వకంగా జోడించినప్పుడు తప్ప మేష్టరు దగ్గర త్రికరణశుద్ధి దొరకదేమో అసలు? అట్లా త్రికరణశుద్ధి లేకనేకదూ, మొదట ఇందులో చేరి, ఒకటి రెండేళ్లు కుర్రాళ్ళమీద 'ఎక్స్పెరిమెంట్లు చేసి, ఇది జీవితం అంతా తమరికి శాశ్వతం అయిపోతే తమరు అల్లానే ఉండి పోవాలి ఫర్లాంగు రాయిలాగ అని గావునుగా చాలామంది ఒడుపు దొరికినప్పుడు అది వొదిలిపెట్టి కడమావృత్తుల్లోకి సర్దుకుంటోచ్చేదీ! ప్రస్తుతం ఇతర ఉద్యోగాల్లో ఉంటూన్నవారు చాలామట్టుకి మొదట్లోకొంత కాలం ఏచిక్కుల వల్లయితేం మేష్టరీ చవిచూసిన వారేగా? కాని ఒకటే. అప్పట్లో, మనిషికి వచ్చిన పని ఘోస్తుపడే

వరకూ మేష్టరీ ఓటీ తేరగా ఉండేది అందుకని చేరేవారు. ఇటీవల అట్లా వీలు కుదరటం లేదు ట్రైనింగు అయినా సరే టికాణా లేకుండా ఉంటే, వట్టి వాళ్ళమాట లెక్కే మిటి! కాని ఇక్కడో చిన్న పేచి మేష్టరీ చేసివస్తేగాని ట్రైనింగులో సీటు ఇవ్వరట. ట్రైనింగు అయి వెడితేగాని మేష్టరీ ఇవ్వరట. ట్రైనింగు అయింతరవాత ఏమి చెయ్యడానికీ తోచటం లేదు చాలామందికి. కొందరు, ఊళ్ళు తిరగడం మానేసి, అదెట్టి పైవారికి రాసిచ్చిన బాండు రద్దు చేయించి, ఇతరం చూసు కుంటే శ్రేష్ఠం అంటున్నారు. కొందరు "ఏమిచ్చినా సరే బోధనవర్షం కురిపించక మానం" అని గ్రహస్థితి వల్ల కక్కూ ర్తికి ఎంతకైనా మొత్తపడుతున్నారు. కొందరు గడసర్లు, "మీ స్కూళ్ళో ఫలానా ఆయన వెళ్ళిపోతాట్ట, తక్షణం వెళ్ళ మనండి. నేను అఖండపిండాన్ని. ఏదిపడితే అది చెబుతూ స్కూలు పైనల్ని లాంగదీసుకుని మూడు చెరువులనీళ్ళు తాగి స్తాను" అనిదరఖాస్తులు బాకెట్టి చూస్తున్నారు. కొందరు "రెండుమూడు సంవత్సరాలు పెండరాళ్ళే పుట్టించకపోతివే మిరా, బ్రహ్మాజీ!" అనుకుంటున్నారు. ప్రస్తుతం ఇల్లాఇల్లా అయిందండి. సంగతి. ఇల్లా మేష్టరీ ఉంటే, "మీపనే బాగుం దండీ, నెలకి ఇంతాఅని నియామకంగా ముట్టుతోంది ఏదో ఓటి" అనివీళ్ళని స్తోత్రంచేసే సరికొత్తప్లీడరూ ఉంటూంటాడు

అయితే వస్తుతః సర్వకాల సర్వావస్థలయందూ కూడా ఉంటూన్న కొన్నికొన్ని విశేషాలూ నైసర్గికాలూ

బట్టి మేష్టరీఅనగా-ఏవో పద్ధతిపుస్తకాల్లో వండి పెట్టినసంగ తులుపాతవి కుఱ్ఱాళ్ళకి వడ్డించడమనీ, అజ్ఞానం అనే పేరుతో అందరి మనస్సులకీ ఉండే సామాన్యరోగానికి మందెయ్యడ మనీ, సృష్టించడం అనేది లేక అదివరకే సృజింపబడిఉన్న కుఱ్ఱాడి తెలివి ఊరికే గొడారివాడులాగ బాగుచెయ్యడమనీ, కుఱ్ఱాడు జ్ఞానార్థం బయలుదేరుతూన్నప్పుడు ఊరికే చూపుడు మనిషిలాగ లాంతరు చేత్తోపుచ్చుగు నడవడమనీ వగైరా ఉపమానాలు సంధించి అల్లాంటిపనులు చెయ్యడానికి బ్రతి కున్న వాళ్ళు బ్రతివాళ్లూ పనికొస్తారని మూర్ఖులూ జ్ఞానులూ కూడా అను కుంటూన్నంతవరకు మేష్టరీకి గణ్యత తలక్రిం దైనారాదు. మా ప్రజలు జ్ఞానులు కావాలి, మా ప్రజకు బోధ కావాలి. సమర్థుల్ని అందుకోసం తేవాలి, వాళ్ళనితృప్తి పరచి వాళ్ళకి సర్వస్వాతంత్ర్య మియ్యాలి, మా దేశం అభి వృద్ధి కావాలి, మామతం, మాభాష, మాసర్వస్వం అనే మోస్తరుగా 'మా' అనేది, పుడితేగాని, అహంకార రహిత మైన 'మా' అనేది, మానుషత్వం సార్థకంచేసే 'మా అనేది పుడితేగాని, 'మే' అనేదిపుట్టి మేష్టరీకి మన్ననగలగదు. అప్పుడూ అనుమానమే. దీనికిచాలా కారణాలు ఉన్నాయి. ఇది కడమవృత్తులతో పోలిస్తే ఇది ఇట్లా ఎందుకుంటుందో బోధపడుతుంది. కడమ వృత్తులు పెద్దవాళ్ళతో పని. మేష్టరీ అంటే అజ్ఞానులతో ప్రమేయం. పాపం ఒకాయన ఒళ్ళుమండిపోయి గావును, 'మీ రేంజేస్తున్నారండీ' అని

అడిగితే? 'మాడల్ని కాస్తున్నానండీ' అన్నాట్ట. అజ్ఞానితో ఏమి హెచ్చు తగ్గువచ్చినా జ్ఞానిదే తప్పు. కాబట్టి, అజ్ఞాని ఏమిచేసినా, జ్ఞాని అందుకు ఓర్చుగోవాలి, తన్ని కానట్టు.

తిట్టికొట్టి రేని తిరిగి మాటాడక
అట్టుఇట్టు చూచి అదిరిపడక
తనను గాని యట్టు తత్తరపడకున్న
నట్టివాడు బ్రహ్మమౌను వేమ.

అన్నదానిలో 'మేష్టరౌను వేమ' అని వేసుకుంటే కుదురుతుంది. ఆ జ్ఞానానికి విలవ బొలుకు కట్టలేము. కట్ట గల తండ్రి వగైరాలు అప్పుడు అక్కడ ఉండరు. అందుకని బోధన అమూల్యం. కడమవృత్తులు ఒక్కడి పనే. బోధన ఇద్దరి తెలివితేటల వ్యవసాయం, ఉమ్మడివ్యాపారాల్లో ఎప్పుడు మాట దక్కేడిసింది? మేష్టరు తన తెలివివల్ల కుర్రాడికి తెలిసిందని, కుర్రాడు తన తెలివివల్ల గ్రహణం సిద్ధించిందని. పైగా, 'తెలిసిందా కానే బ్రహ్మవిద్య'! కొన్నాళ్ళయింతరవాత, అందుకనే, కొందరికి, తమకి చిన్న తనంలో మేష్టరు తమగికి చెప్పేడిసిందేమిటి, అనిపిస్తుంది. కాని, ఆ గురువుమాత్రం, ఆ క్లాసుకే జీవితం యావత్తూ బోధచేస్తూ—అంటే, క్రితం జన్మలో మేష్టరు ఒకక్లాసే తెగఫేలయి ఉంటాడు, అందుకనే ఈజన్మలో అది అన్నే సేళ్ళు చదవవలసి రావడం—చిన్నతనంలో తనదగ్గర చదువుకున్నవాడు పైకొచ్చి అక్కరకొస్తే, సందర్భవశాన్ని

'ఫలానా ఆయన పూర్వం నా స్టూడెంటుస్మండి' అని ఎవరూ అడక్కపోయినా చెప్పుగుని మురుస్తూండడం తప్ప ఏమీ కోరకూడదు మేష్టరు. అది స్వత్వంచంపుగుని అన్యత్వం కోసం చేసిన ఎంతత్యాగమో అనుభవించిన వాళ్ళకి మరీ తెలుస్తుంది. తమర్ని చూసుగుని మేష్టరు ఎంత ఇడవుతూన్నా, కొందరు వ్యాసవడం తోటే గురువుని జ్ఞాపకం పెట్టుగోరు, పాపం ఎరగనట్టూ చూడనట్టూ నటించి, మొఖం పక్కకి తిప్పుగుపోతారు; లేకపోతే ఓ నమస్కారం ఖర్చు పెట్టాలని. 'గురువు' అంటే 'తండ్రి' అనికూడా ఉండడం వల్లేమో ఈ ప్రమాదం. జ్ఞాపకమే పెట్టుగోనప్పుడు, ఇక మేష్టరు తనకి వెనక తన అజ్ఞానాంధకారం వదలగొట్టినందుకు ఇప్పుడు ఉద్యోగంలోకి వచ్చి డబ్బు గణిస్తూన్న ఆతడు మేష్టరికి డబ్బిస్తాడా? మేష్టరు పుచ్చుగుంటాడా? లోకజ్ఞాన సముద్రుడైన వేమన్న ఈ సంగతి వ్రాసి తీరాడు.

గురువునకును పుచ్చుకూరైన నివ్వరు
అరయ వేశ్యకిత్తు రర్థమెల్ల
గురువు వేశ్యకన్న గుణహీనుడేమొకో
విశ్వదాభిరామ వినుర వేమ

అని. ఆమోస్తరుగా, కుర్రాడు, వెనక నేను ఫీజు కట్టేశాను పొమ్మంటాడు. పోనీ, అది వాడి దగ్గిరనించి పుచ్చుగున్నాడా మేష్టరు? అబ్బే! పిట్టపోరూ పిట్టపోరూ పిల్లితీర్చాలి. వాడూ వీడూ కాక మరోరుంటారు ఇచ్చి పుచ్చుగోటాలు నిర్ధరించ

డానికి వార్ని పట్టీకు మధ్యవర్తులనచ్చు. మధ్యవర్తులు మన్న నలు చేస్తారూ! ఇత అవకతవక ఎందులోనూ లేదు. కడ మావాటిల్లో లోపాయికారీ మధ్యవర్తులుండి బేరాలు పైసలు చేస్తారు. ఇందులో ముందు మేష్టరే, 'నేను చెబుతానం డోయ్' అంటూ తయారవుతాడుగాని, ఆ పిల్లాడు వచ్చి గాని, వాడితండ్రివద్గైరాలు వచ్చిగాని 'బోధించండి బాబూ' అని ప్రార్థించరు. ప్రార్థన మీాద ఎవ డెక్కడికి వెళ్ళినా వాడి మాట వేదమే. పిలవకుండా వెళ్ళినప్పుడు గెంటకుండా పొమ్మనడమే కష్టం. మరొకరు 'పోనీ' కడమా చాలా మందికి మల్లేమేష్టరూ బల్లెకడితే, పదవికి హోదా ఎక్కువవు తుంది. అందరూ వచ్చి, "అయ్యా మేం అజ్ఞానంవల్ల బాధ పడుతున్నాం, కాస్త ఆరోగం కుదిర్చి పెట్టండి" అని అడగ డంవల్ల! అన్నారు. అల్లాయితే ఇతర లాభనష్టాలు ఉన్నా కుర్చీలకీ బెంచీలకీ ఒక్కబల్లముక్కైనా దొరక్క చావవలసి ఉంటుంది పొమ్మన్నాడుఇంకోఆయన. అదీగాక, 'కడమవృ త్తుల్లో పన్లు కళ్ళకికనబడతాయి. బోధన కనపడదు'. అంటే 'ఆతోటమీాద మీాకు హక్కుభుక్తాలు శాశ్వతం చేయిం చాను. చూశారా నాతఢాఖా' అనిగాని, 'వెనక మీారు శవాకారంలా ఉంటే మిమ్మల్ని మెల్లిన్సుపుడ్ కుర్రాడుబొ మ్మలా చేశాను' అనిగాని, ఏలాయరేనా, ఏడాక్టరేనా అను కోవచ్చు ఒకరితో, ఆసకానక కాని, మేష్టరు, కుర్రాడి తం డ్రితో, 'చూశారూ, మీాకుర్రాడి మనస్సు చాలా ఇరుకుగా

ఉంటూంటే నేను దానికి వ్యాప్తినిచ్చి వైశాల్యం పెంచాను' అంటే పామరుడైతే 'ఛీ, పో' అంటాడు. తెలిసినవాడైతే 'మీరొక్కరే కాదు లెండి, నూవాడూ కృషిచేశాడు' అంటాడు. అందుకని మేస్త్రరీ పనిలో చేసింది చెప్పుకోడానికేనా ఉండదు. మరోటి: కడమూ వాట్లోకి మల్లేకాకుండా, ఇందులో, ఆ ఇచ్చేదానికే, చెప్పిందే చెప్పి చెప్పిందేచెప్పి తెగ డ్రిల్లు చెయ్యాలట. ఎవడికి ఎన్నిసార్లు కావలిస్తే అన్నిసార్లూ చెప్పే సర్వజ్ఞుడు కావాలిట మేస్త్రరు. డబ్బు సంగతి తెస్తే అపవిత్రంట. ఇన్నిసార్లు చెప్పడంవల్ల బండకుర్రాడు ఏం బాగుపడతాడో కాని, ఈ అలవాటు మేస్త్రరికి పట్టుకుని, ఇతడు ఇతరజనంతో మాట్లాడేటప్పుడుకూడా చెప్పిందేచెప్పి మాటతెమల్చక జనాన్ని చంపేస్తూంటాడు. ఏ విన్నిందాల గాలించి చూసినా, మేస్త్రరీలో ఇహసౌఖ్యం ఉన్నట్టు తోచదు. అంటే సన్యాసి అయినవాడు మేస్త్రరీ పదవికి తంగున సరిపోతాడు, అడక్కపోడం అటుంచి ఇచ్చినా పుచ్చుకోకుండాను. అందుకనే పెద్ద పెద్ద గురువులూ ఆచార్యులూ, యతులూ స్వాములూను. కాబట్టి. మేస్త్రరు, శరీరంలో కాకపోతే పీడా పోయిరి అధమం మనస్సులోనూ, తప్పని సరిగా ఆత్మలోనూ సన్న్యాసి అయితీరాలి. డబ్బు సంగతి నోరెత్తకుండా పరసౌఖ్యం మోక్షం సిద్ధిస్తాయి, "పరముకన్న నేమిపావనమూ సామ్ము" అనేనమ్మకంతో స్వార్థం వీడి పనిచేసేవాడు మేస్త్రరు. మేస్త్రరీ దేవుడు మెచ్చుకోవాలి

గాని మానవుడు మెచ్చడు. జ్ఞానంతో జోక్యం లేనివాళ్లు మేష్టరీ ఉద్యోగమే కాదంటారు. కాని, అది మనకి కనబడే ఈ పాపపు ప్రపంచానికి నెత్తిమీద ఉన్న అమలిన బాల హృదయరాజ్యానికి సర్వాధికార మనిగ్రహిస్తే, దాన్ని ఉద్యోగం అనవచ్చు. అహాఁహాఁ, దాన్నే ఉద్యోగమనాలి. అందులో ఈ కాలంలో మరీను. ఈ కాలం ఎడ్యుకేషన్ ఎవరి చేతుల్లో ఉందో తెలియని కాలం. ఒకటి: గవర్నమెంటు! వారిని గ్రాంటుకోరకుండా ఉంటే వారికి చాలు, వారికి "ఎడ్యుకేషన్" ఎల్లా ఉన్నా సరే. రెండు: వారి తరఫు ఏజెంటు అనగా ఇనస్పెక్టరు! కొత్తపద్ధతులూ, పాఠాల లిస్టూ ఉంటే ఆయనకిచాలు, "ఎడ్యుకేషన్" ఎల్లా ఉన్నా సరే, మూడు: మేష్టరు! ఈయనికి ఒకటో తారీకూ, ఆరోజున జీతంరాళ్ళూ సరిగ్గా ఉంటే చాలు, "ఎడ్యుకేషన్" ఎల్లాఉన్నాసరే. నాలుగు: విద్యార్థి! ఇతగానికి సంతర్పణ క్రింద మార్కులు కురిసిపోతేచాలు, "ఎడ్యుకేషను" ఎల్లా ఉన్నాసరే. అయిదు: విద్యార్థితండ్రి! అతగానికి వాళ్ళ అబ్బాయి ఆ కాస్త మెట్టూ దాటి మేష్టరు కటాక్షంవల్ల పైక్లాసులో పడితేచాలు "ఎడ్యుకేషన్" ఎల్లాఉన్నాసరే. ఆరు: ఇతరులు! ఈ ఇతరులకి ఏమీ అక్కర్లేదు; ఇప్పుడంతా నాన్సెన్సు, పాడైపోయింది, తమరు చిన్నప్పుడు చదివిన చదువే చదువంటారు. ఇల్లాంటి కాలంలో త్రికరణశుద్ధిగా చేసిందే మరీగొప్ప మేష్టరీ. మేష్టర్లంతా కలిసి ఆందోళన

చెయ్యాలి అంటారు. కలియడానికి త్రాణ ఉంటేకాదుటండీ? పైగా ప్రతీమేష్టరూ ఒక్కొక్క ప్రత్యేక విశేషంతోటి ఢక్కా మొక్కీలకి ఆగి రగడుదేరి పోయిన వ్యక్తికింద తయారై తన చేష్టలన్నీ శుద్ధ న్యాయమని స్థాపించుగోవాలని యత్నించి నెగ్గుతూంటాడు ఎరగని పిల్లల దగ్గిర! ఇల్లాంటివ్యక్తులు ఏరెండూకలవవు. ఆమాట కొస్తే మేష్టరికి అసలు వ్యక్తేలేదు. ఏవో రెండురాళ్లు వస్తున్నాయికదా, హాలు పూచీగడిచిపోతోంది, ఏమన్నా అంటే ఆకాస్తగోడూ ఎక్కడ చెడుతుందో, ఇక మరేమీ చేతగాదాయిరి అని అన్నింటికీ వడట్టి గొంతు కెత్తనివాడికి వ్యక్తిత్వం ఉందనడం తిట్టడం అన్నమాట. అంచేత నేకాబోలు, మేష్టరీ ఎంతకొండ మీదిది అయినా, Findlay చెప్పినట్టు మేష్టరీచేస్తూన్న ఏతండ్రీ మళ్ళీ తనకొడుకు మేష్టరుగా ఉండాలని కోరడుట. అంటే, తాను జన్మబాల్యం స్వీకరించి తనజన్మలో చేసిన త్యాగం తరతరాల వరకూ చాలునేమో. అదేమోకాని, పది పదిహేనుఏళ్ళు మేష్టరీచేసిన ప్రతీ వాళ్ళనోటంటా ఇల్లాంటిమాటలు వింటూంటాం. "నాకు మొట్టమొదట్లో వెనక ఫలానా 'ఛాన్సు' వచ్చినప్పుడు ఫలానా ఉద్యోగంలో చేరిఉంటే, ఈపాటికి చాలా గొప్ప ముండావాణ్ణి అయిపోదును. అందాకా ఎందుకు అప్పుడే ఆ ఛాన్సుల్లో చేరిన ఫలానావాడు ఇప్పుడు పెద్ద ఇనస్పెక్టరు. కనపడితే పలకరించనేనా పలకరించడు. కాని నాకిది రాసింది" అని, మేష్టరీ ఉద్యోగమో కాదో తెలి

యదు కాని ఉద్యోగులంతా మేష్టరు సృజన, ఇంతమంది ఉద్యోగుల్ని తయారుచేస్తున్నానుగదా, ఇహసౌఖ్య ప్రధానమైన ఉద్యోగం నేను అందుకోసం వదిలేస్తాను అనేవాడు మేష్టరు. ఇంకొకడు బాగుపడితే తనూ బాగుపడ్డట్టే అనుకో గలిగినవాడు మేష్టరు. అంటే మేష్టరికి భావనాశక్తి 'భూమికీ ఆకాశానికీతాళం' అన్నంత ఉండాలి. క్రియాముక్కు, హిందూవులు వేదాంతులు. వారిలో మేష్టర్లు అగ్రస్థానం అలంకరించాలి. ట్రైనింగు అయే టప్పుడు అధమం సహంకాలం, మేష్టరికి ఆసైకాలజీతో పాటు వేదాంతబోధకుడా సవిస్తరంగా చెయ్యాలి, అందులో ముఖ్యంగా కర్మవాదన. వెనకటి కాలంలో ఇండియాలో ఎక్కడపడితే అక్కడ కర్త, కర్మ, క్రియలుదొరికేవిట. కాని, క్రమేపీ, కర్త క్రియలసి ఇతరులు హరించారు—కర్త కనిపించదు, క్రియ శూన్యం అయింది. హిందువులు కర్మ ఒక్కటే ధరించి, భరించారు. భరించాలి. అందుచేత, ఈయొక్క-మేష్టర్లున్నారే, వీరు, భుక్తి ఎల్లానూ ఇంతే అని ముక్తిమోక్షాలకోసం దేవుళ్ళాడి పనిచెయ్యాలి!

" కాకన్ మానవు పూర్వజన్మకృతముల్
కర్మానుబంధంబులై
లేకన్ మానవ వెంతజాలిపడినన్
లేముల్ సిరుల్ రాఘవా!"

---

# ఆంధ్రాయూనివర్సిటీ పట్టుదలలు

[ 5-8-27 తేదీని సర్. బి. యన్. శర్మగారి అధ్యక్షతకింద రాజమండ్రీ ఆర్ట్సు కాలేజీలో, పాతవిద్యార్థి సంఘము తరఫున, జరిగిన సాంవత్సరిక సమావేశ సందర్భంలో, చదివిన వ్యాసము. ]

నవ్వించడం అంటే మొత్తంమీద తిట్టడం, ఏకడం, దెబ్బలు తియ్యడం అనే ఉద్దేశం ఉంటూనే ఉంటుంది. కాని, అది హృదయంలేని ఉద్దేశం. నవ్వించడంఅంటే కొన్నిలోట్లు కనపరచడం అని కొంతమంది ఉద్దేశం కాని, అది వివక్షత లేని వెర్రి ఉద్దేశం. నవ్వించడం అంటే ఒకర్నే బాధించడం అని కొందరి ఉద్దేశం కాని, అది సానుభూతీ సరసంలేనిఉద్దేశం. కొన్ని నిమిషాలపాటు అందరూ, ఒకే విషయం, సరదాగా, ఆలోచించుకోవాలనే ఉద్దేశం తప్ప, ఇతరమేమీ నాహృదయంలో లేదు. ఆంధ్రుల కందరికీ చెందిన విషయం "ఆంధ్రాయూనివర్సిటీ" గనక ఆమాటలే నాలుగు అనుకుందాం. ఆ సంస్థ ప్రశంసనీయం. దానికోసం చేసి చేస్తూన్న ప్రయత్నాలు గొప్పవి. ఇప్పుడు ముచ్చటించేది, ఏతద్విషయం ఈమధ్య మావన్నందీ కనపరచిన పట్టుదలలుమాత్రమే.

ఆంధ + ర=ఆంధ్ర, అనేపదం చిరకాలంనుంచి అమలులో ఉంది. ఆంధ్రపత్రిక, ఆంధ్రమహాజనసభ, ఆంధ్రమహాసభ, ఆంధ్రులచరిత్రలాంటివీ-అన్నట్టు మన ఆంధ్రసాహిత్యపరి

పత్తు లాంటివీ—ఆవిర్భవించి ఆందోళన చేసింతరవాత ఇంకా చెప్పడానికి అలవిలేనన్ని ఇతర సంస్థలు: అభినవాంధ్రమహా దోమల ప్రత్యేక సమిష్ఠి, ఆంధ్రమహా-ప్రతీవాళ్ళూ-అద్వితీయ సభ! మొదలైనవి ఆర్భాటం జరిపి ఆంధ్రులవ్యక్తి ఆంధ్రుల తడాఖాకనపరిచిన తరవాత, ఇన్నాళ్ళకి, ఆంధ్రాయూనివర్సిటీ—(దీని కోసం ఆవిని తపించినవారు కొంచెం ఎడంగా ఒత్తి గిల్లినతరవాత) అవతార మెత్తింది. ముందుసూచనలు లేందే అవతారం అపూర్వంతంగా రాదు. ఇదిపుట్టవలసినంత అవసరం ఉందోలేదో చూడమని పైవారు మొదట ఒకమిటీని ఏర్పరచారు. "ఆ కమిటీలోకూడా బొత్తిగానాన్-ఆంధ్రుల్ని వెయ్యాలీ?" అని కొందరు ఆంధ్రులు పైకి కనబడనీకుండా "విదిన్ బ్రాకెట్సు" లో కొప్పడ్డారు. ఆ కమిటీలో వట్టి ఆంధ్రులేకాక, అరవ మహమ్మదీయ ఐరోపీయ సోదరు లుండబట్టే, వారంతా కలిసి, ఇది పుడితేగాని వీలు లేదనీ దీన్ని ఆంధ్రదేశంలోనే పెట్టాలనీ, ఆంధ్రులకి ఆంధ్ర భాషయందుండే అభిమానవుతోతు కొలవడానికి గొలుసు లేదనీ వగైరా విశేషాలు ఉదారస్వభావంతో నిష్పక్షపాతంగా తీర్మానించారు ఆ కమిటీలోనే ఇతరులు లేకుండా అంతా కేవలాంధ్రులే అయి ఉంటే, ప్రతీవాడూ వేరే మంచివాడే అయినా, వేరే ప్రతివాడిహృదయంలోనూ ఎంత ఇష్టం ఉన్నా, ఏ ఇద్దరికీ భరించక, అప్పుడే శిఖపట్లగోత్రం లోకి దిగి, మొదటి తీర్మానం—"ఇది తక్షణం కావాలి

కాని, ఈ ఆంధ్రా యూనివర్సిటీ ఆంధ్రజిల్లాలలో తప్పించి మరోచోట పెడితేగాని మా వాళ్ళు హర్షించరు. మా సంగతీ, మా మజాకా, మీ రెరగరు'' అనిచేసి ఉండేవారు. ఆ అవాంతరం తప్పింది. పోనీ ఆ కమిటీవారే ''ఇది తప్పని సరిగా ఫలానా గ్రామంలో పెట్టాలి'' అని తీర్మానించి, అది పైవారితో చెప్పి ఓశాసనం చేయించి పారెయ్యవలసింది. ఎంచేతంటే, హెచ్చుతగ్గయితే బుర్ర ఊడిపోతుందేమోరా బాబూ అనిపించే శాసనం ఒకటీమాత్రం విధి అనుకుని శిర సావహిస్తాడుగాని ఆంధ్రుడు, తక్కిన ధర్మాలూ వగైరాలు అతగానికి నిషేధాలే—అనగా జాంతేనయ్! అల్లాకాక, కమిటీవారు కొన్ని క్షేత్రాలు జాబితారాసి, వాటి ఔన్నత్యాలు బేరీజుచేసి, కొన్నిటిని తోసిరాజని. తక్కినక్షేత్రాలు ఇల్లా ఇల్లా ఉన్నాయి, మీ చిత్తం వచ్చినచోటు క్షేత్రంచేసుగోండి కేంద్రం చేసుగోండి అన్నారు. ''మీ చిత్తం'' అని ఆంధ్రులికే ఏదేనావదిలిపెట్టి ఊరుకున్నప్పుడు, ఆంధ్రులికి తాత్కాలికావేశం బయులుదేరందెప్పుడు! మొట్టుకి యూనివర్సిటీ ఇవ్వడం రూఢేఅన్నారు. యూనివర్సిటీ అనేముక్క ఇంగ్లీషుగా ఇండియాకి వస్తాసిపాయ్ మ్యూటినీయేడే. కాని దానిభావం హిందూ దేశానికి కొత్త గాదు. చాణక్యుడు తక్షశిలా విద్యాపీఠంలో చదివాట్ట, నాలందావిశ్వవిద్యాలయానికి ఇతర దేశాల్నించి చదువుకోడానికి జనం వచ్చార్ట అంటే, అవన్నీ అప్పుళ్ళు!– పోయినవి

మళ్ళీరావు. అందుకని 'విద్యాపీఠం' 'విశ్వవిద్యాలయం' అనేమాటలు మాని "యూనివర్సిటీ" అనేపదార్థం సరిగా పైకి పలికేటట్టు ఆముక్కే వాడదాం ప్రస్తుతం! (వెనకటివి పాతవాసన కొడుతున్నాయని ఇంగ్లీషాంధ్రులు తప్పట్టుకోకుండాను.) 'విద్యాపీఠం' అనే మాటకి గౌరవం వచ్చింతరవాత అదీ వాడదాం.

పెద్ద పెద్ద లిచ్చిన నిర్వచనాలలోకి దిగకుండా టూకీగా వేదమూలం చూస్తే యూనివర్సిటీ అంటే ఒకటికింద మారి పోవడం, అని. అనగా అనేకత్వం పోవడం, ఏదేనా వేరే సాధించగల్రుగాని, ఆంధ్రులు, నానాత్వం చంపుకోగల్రా అని, కొందరి సందేహం. ఎవడిమట్టుకు వాడు తను కలిసినట్టుగా ఉండడానికి సిద్ధమే తనఅభ్యంతరం లేదంటాడు, కాని అక్షరాలా తను అన్నమాట జరక్కపోతే ప్రపంచానికి చాలా ఉన్నాయి పాట్లు అంటాడు. ఓసభలో కొంచెం అల్లరిజరిగి గోల అయింది. సైలెన్సుగా ఉండాలని అందరకీ ఉంది. ఉండి, ప్రతీవాడూ సైలెన్స్ అంటే సైలెన్స్ సైలెన్స్ అంటే సైలెన్సు అని మొదలెట్టి పెద్దగొడవచేసి, మొదట గోలేనయం అనిపించారు. అల్లాంటప్పుడేనామరి కలవడం! పోనీ ఇల్లా అందాం. ఆంధ్రులు! యూనివర్సిటీ గనక నిర్వహిస్తే, మరి చెయ్యలేం దేమిటి అయితే కాలేజీ ఉందికదా, కాలేజీకి యూనివర్సిటీకి తేడా ఏమిటి? అంటే "కాలేజీ అక్కడే ఆగుదాం అంటే యూనివర్సిటీ కొంచెం

ముందుకి నడుద్దాం అంటుంది” అని. ఎవరికి, యూనివర్సిటీ కావలసింది? నేను, నాకు కావలసిన వాడు, ఒకటి వగైరా వేళ్ళువిడిచిన బంధువు, నా జ్ఞాతి, నా శాఖవాడు, బీరకాయ పీచు. బాదరాయణసంబంధం, నా భాషవాడు, నా మతంవాడు, నా గ్రామం, నా దేశం, నా ఖండ వాడు—అనే మాట కూడా అణిచివేసుగున్న వాళ్ళకే 'అహం,' 'మమ' గాళ్లకి యూనివర్సిటీ అనవసరం. అనగా జ్ఞానులు చెప్పిన రాతి మనిషి, చెట్టుమనిషి, పశువుమనిషి, మనిషిమనిషి అవస్థలు దాటిన మనుష్యులకి కావాలి. లేకపోతే పారిస్ యూనివర్సిటీ వారు ఒక ఆంధ్రుడి విద్య మెచ్చుకోడం వీలుపడి ఉంటుందా! నేనూ నన్నెరుగున్న కొందరూమాత్రమే బాగుపడాలి అని పెట్టుగున్న యూనివర్సిటీలు నిష్క్రమించాయి, బాగుపడ్డ వాడల్లా నావాడే అనుకున్నవి జీవించాయి అని చరిత్ర కేక లేస్తోంది. ఏమైతేం? అర్హత చూడవలసింది, ఆచరణలోకి దింపి మరీనూ. మనయూనివర్సిటీ ఇచ్చారు. ఇస్తే, ఏమైందీ, ఆంధ్రాయూనివర్సిటీ పుడుతూనే మూడు కాలేజీలున్న మూడు కేంద్రాల్లో వెలిసింది–మూడుమూర్తులసారంపు ముద్దయనగ–అన్నట్టు. ఒకటికాదు, మూడూ, కేంద్రాలు. వలయానికి ఒక కేంద్రంఎరుగుదుం; పోనీ, కోలవలయానికి రెండు కేంద్రాలు కూడా ఎఱుగుదుం; కాని మన యూనివర్సిటీ చాలా పెద్ద లెక్కల్లో బొమ్మ గనక ముక్కేంద్ర భూయిష్ఠం అయింది. మరో హాపని: మూడు కేంద్రాలేమిటీ అంటే, మనకి ముగ్గురు

పెద్ద దేవుళ్లూ, ముప్పైమూడు కోట్ల చిన్న దేవుళ్లూనూ. కొందరు ముందు ఉత్తరోత్రా ఇవి వేరే యూనివర్సిటీ లవుతాయను న్నారు. అంటే ఈ యూనివర్సిటీ పిల్లల్ని పెడుతుందని. మనలో ఇంకా ఓమూల పుడుతూన్నవాడికీ అప్పుడే సంతా నాపేక్షే. అదీగాక, డెబ్బై ఎనభై వేల చదరపుమైళ్ళకి ఒక్క కేంద్రంఎల్లాకుదురుతుంది? పైగా, ఒకటి, ఒకడు అంటే ఆంధ్రు డికికోపం. ప్రతీఆంధ్రుడూ దేవుడు ఒక్కడే అంటాడు గాని ఆయనపేరు విషయంలో మాత్రం ఏ ఇద్దరాంధ్రులూ సరి పుచ్చుకోరు. "ఫలానావిద్యలో మీ ఆంధ్రుల్లో గొప్పవా డెవడు?" అని అన్యుడు ఆంధ్రుణ్ణి ప్రశ్నిస్తే, ఇతడు "కోటి మందిని చెప్పచ్చు" అంటాడు. "ఏదీ, ఒక్కణ్ణి చెప్పండి చాలు," అంటే చూసిచూసి ఎవ్వర్నీ చెప్పలేడు. తీరా చెబితే తనమాటో, ప్రతీవాడికీ ప్రతీదీ వచ్చుననేగా!-ఏది! -అందుకని చెప్పడు. చెప్పలేనని ఛస్తే అనడు. ఒకవేళ ఏదేనా పేరు చెప్పడానికి తనమనస్సు ఇష్టపడితే, ఆ తక్కిన వాళ్ళు తన్ని తిట్టిపోస్తారు, ఎందుకొచ్చింది, అనుకుని ఊరు కుంటాడు. పోనీ అవతల అతనే "ఫలానా మీ వాడుగొప్ప వాడంటారే?" అంటే, "ఆ, వాడి మొహం పోదూ, నాద గ్గర తీస్తే, వాడికేంవచ్చు" అంటాడు. అందుకని 'శూన్యం' అనగా లేనిదానియందుండే మక్కువ ఆంధ్రుడికి 'ఒకటి' అనగా ఉన్నదానియందు లేదు, అనగా అతడు అనంతవాది. అవునా, అల్లాంటి స్థితిలో యూనివర్సిటీ కచేరీ ఎక్కడాఅని

వచ్చింది. కాలేజీలు జుట్టుకున్న వాళ్ళకచేరీలూ లగాయిస్తే గడంవాళ్ళ నోట్లో కరక్కాయేనా, వాళ్ళకిమాత్రం కడుపు మండదా? అందుకని ఈ కాలేజీ ఊళ్ళోనూ వద్దు, ఆకాలేజీ ఊళ్ళోనూ వద్దు, అని కచేరీల విషయం తువితగూ చెప్పారు. తువితగూ అంటే 'తువి' లో పెట్టమని కాదు, మధ్యస్థంగా అన్నమాట, మొదట తిరస్కరించిన చోటన్నమాట, అంటే మనం తిరస్కరిస్తున్నవి మనసు కుదిరితే పని కొస్తాయన్న మాట. చక్రం తిప్పడానికి అనేక విద్యలూ రాజకీయం, సారస్వతం, లోకజ్ఞానం ఇవి గలవార్ని నామకరణం చేశారు. స్వయంవరాల్లో వచ్చేవారిని ముందు చూడాలి. ఎన్నికలు, విద్యావిషయం లేనిచోట్ల పని చేసినట్టు విద్యావిషయంలో చెయ్యలేవేమో అని కొందరికి భయం. ఆమట్టున యూనివర్సిటీ చలాయించే సభ తయారవడానికి ఎన్నికలు కానీము న్నారు. అయిదేళ్ళ బియ్యేలు కొందరు పైకి తేలారు, మునిగిపోతూన్నవాళ్ళని కావలసినవాళ్ళు వచ్చి అడ్డంపడి గట్టుకి లాగారు. అక్కణ్ణించి అనుకోకుండా అచ్చుఉత్తరాలు ప్రతీటపాలోనూ కురిశాయి అనేకమందికి! ఇల్లాంటి అంశంతో—

ప్రథమవోటు తమది పారవేయుడు నాకు
తక్కినట్టివోటు తమరి మనసు
డోలుకట్టివత్తు డొక్క బద్దలు చేసి
పంపుడయ్యనన్న మాట లేల.

చెప్పుటకును సిగ్గు చెప్పకుంటే చిక్కు
చెప్పవలసి వచ్చి చెప్పుచుంటి

పట్టివాడికిచ్చి మట్టిచేయక పోటు
గట్టివాడ నన్ను గట్టుకొనడు.

ఆ ఎన్నికలమీద కొందర్నీ, పేరు గొప్ప చెప్పిన కొందర్నీ కలుపుకుని సభ ఏర్పడడమే కాక అంతస్సభలు కూడా వెలిశాయి. కొందరు పామరులకి విద్యాధికులూ, ఉపన్యాసకులూ సభలోకి ఎక్కడం లోపల అట్టే ఇష్టం లేదుట. విద్యాక్షేమం కోసం మాసికలు పడడం ఇతరులకి తెలిసినంత దిట్టంగా మేష్టర్లకి తెలియదని. పైగా, విద్యా విషయం ఏమీ తెలియకపోతేంగాక శాసన సభల్లో వాదించి చొరవచూపే కొందరికి మల్లే చొరవచూపకుండా, వీరు, అనేక విషయాల్లో భయపడి బెదిరి దేవుడిచ్చిన తలకాయలు ఒక్కటేగించి పారెయ్యడానికే ఉపయోగిస్తారేమో అనే దిగులు చెప్పేనట. కాని, భ్రమాలంకారాల కెక్కడికి? సభావ్యవహారంలోకి రాకపూర్వం కొంచెం వెనక్కి వెళ్ళి రావాలి.

కాలేజీయేనా లేదాయిరి. కచేరీలేనా లేకపోవడం ఘోరం అని అన్న తునితగూ చూశాం. కాని, దరిమిలాని, ఏమైందీ! కచేరీలు ఇప్పుడుమరి ఉండనేఉన్నాయికదా, కచేరీలున్నచోట కాలేజీలేకపోవడం శోచనీయంకదా, న్యాయమే కదా! అందుకని అక్కడే అన్నిటికంటె గొప్పకాలేజీ పెట్టన్దా అనే అభిప్రాయం వచ్చింది! వెళ్ళింది. అసలే మూడల్లా నాలుగై యూనివర్సిటీ నాలుగు స్తంభాలాట ఆడు

తోంది. ఎక్కడున్నా బలమంతా కలిసి ఒకటే. అసలు నాలుగుచోట్లు అవడంతోటే ప్రతీచోటా బలం తగ్గింది అన్న మాటేగా! అందులో ఇతర మారాముళ్లు, ఎప్పటికప్పుడు!

"పల్లెటూళ్ళ పట్టుదలలు" జ్ఞాపకం వస్తున్నాయి. ఒక పల్లెటూరి సభలో ప్రథమ తాంబూలం ఇవ్వడం ఎవరికీ అని ప్రశ్న వచ్చిందిట. శూన్యంగారి కివ్వాలని ఒకాయనా, కాదు పూర్ణంగారి కివ్వవలసి ఉంటుందని మరొకాయనా కుస్తీపట్టుగున్నారట.

మొదటివాడు—శూన్యంగారు గొప్పవాడు.

రెండోవాడు—పూర్ణంగారూ చాలాగొప్పవాడే.

మొ—శూన్యంగారు వృద్ధు. పూర్ణంగారేమిటి, చవటా!

రెం—పూర్ణంగారు అతివృద్ధు. శూన్యంగారేమిటి, చచ్చూ!

మొ—శూన్యంగారి తల నెరిసింది లెండి.

రెం—పూర్ణంగారి తలా నెరిసింది లెండిమరి.

మొ—ఛీ, ఊరుకో! శూన్యంగారికి అంతకంటూ తల నెరిసింది!

రెం—ఛీ, అల్లా అయితే, పట్టూ! నెరిసిన తల వెంట్రుకల సంఖ్య స్థిరపరచడానికి ఓ పంచాయితీ పెడదాం— అని.

అల్లాంటి పట్టుదలలు చిన్న గ్రామాల్నించి పెద్దగ్రామాలదాకా పాకినట్టు కనబడుతుంది, భాషమీద కత్తిపోయి

గ్రామభక్తి లోపడితే ప్రజకేం క్షేమం, జాతికేం గౌరవం? త్యాగరాజు, 'రామభక్తి సామ్రాజ్యం' అంటే మనం 'గ్రామభక్తి సామ్రాజ్యం' అని పాడుకోవలసివస్తోంది. ఆంధ్రుల్లో సరి సమానులైన గొప్పవాళ్ళు కొందరు ఇంగ్లీషున దెబ్బలాడుకున్నప్పుడు You how much? అంటే You how much? అనుకుంటారు—నీవెంతయనిన నీవెంతయనుచు—అన్నట్టు కాని; పెద్దగ్రామాలవారిప్పుడీయూనివర్సిటీ కోసం నేనెంతంటే నేనెంతని దెబ్బలాడుకుంటున్నారు. అంతా ఒకందుకు ఒప్పుగున్నారు:—"యూనివర్సిటీ పెట్టే చోటు హుషారీగా మజాగా ఉండాలి, ఆకర్షించాలి, ఎప్పుడులేచి పోదాంరాగురుడా? అని ఉండకూడదు" అని. అయితే. అల్లాంటి ఊరు తమరి ఒక్కరిదే అని ప్రతీవాళ్ళూ దెబ్బలాడేది. స్వంతానికి ఏదేనా కావలసొచ్చినపుడు, తర్కం దానంతట అదే చేతవుతుంది, తమరు మాట్టాడిందంతా తర్కమే అనిపిస్తుంది. ఈ దెబ్బలాట బయలుదేరిం తరవాత ఏఊరు ఎందుకు ప్రసిద్ధో అందరికీ విశదమైంది. అంటే యూనివర్సిటీ రాగానే ఆంధ్రులకి కొంతవరకు హిష్టరీ జాగ్రఫీలు ముట్టాయి. ఏదో గొప్ప సందర్భం వస్తేగాని ఉన్న మహాత్మ్యాలు పైకి రావు—ఎలెక్షనులోగాని మానవుల చతురోపాయాలూ, వివిధ ప్రజ్ఞలూ వరసాగ్గా తెలియనట్టు! "మా ఊళ్ళో అన్నం అరుగుతుంది, మా ఊళ్ళో యూనివర్సిటీ పెట్టాలి" అని ఒకరు, ఏ ఊళ్లో అరగదు, ఎవరికి? "మా ఊరవతల ఖాళీస్థలాలున్నాయి,

అందుకని యూనివర్సిటీ మా ఊళ్ళోనే పెట్టాలి” అని ఒకరు. ఏ ఊరవతల ఖాళీగా ఉండదు? “మా ఊరు చల్లగా ఉంటుంది, కావలసినంత సేపు చదువుకోవచ్చు; మా ఊరు మంగలం, రోడ్లు అస్తమానమూ దుమ్మెత్తిపోస్తాయి; వాళ్ళ ఊరు బొత్తిగా పెనం, మనుష్యులకి అస్తమానం వేపుడే; సరి, వాళ్ళ ఊరు గాడిపొయ్యి, తొంగు ఊడిపోతుంది” అని ఒకరు. “మా ఊళ్ళో గోంగూర ఉంది” అని ఒకరు. “మా ఊళ్ళో అదీ వంకాయలూ కూడా తెల్లవారేసరికి ఎగిరి చక్కా వస్తూంటాయి” అని ఒకరు. “మా ఊళ్ళో పెదవారింజపళ్లు దొరుకుతాయి, ఇప్పుడది ఫలరాజం” అని ఒకరు, “మా ఊరు పక్కని కొండఉంది” అనిఒకరూ, “మా ఊళ్ళోనే కొండలున్నా” యని ఒకరూ, “పటప్, కొండమీదే మా ఊరుంది” అని ఒకరు. “మా ఊరు హాయిగా సముద్రతీరం, మా ఊళ్ళో పెడితే ఏం ఉప్పెనవస్తుంది?” అని ఒకరు. “మా ఊరు కొంచెం వేడిగా ‘సహారా’ లాగ ఉంటేం’ వంటచెరకు కొనుక్కోకుండానే పదార్థాలు ఉడుకుతాయి, లాభం కాదా?” అని ఒకరు. అయితే ఒకటి: అద్దికొచ్చిన పెద్దమనిషికి ఇంటాయన ఇంటికి ఉండే హంగులూ సౌకర్యాలూ చూపిస్తాడు, కాని ఖాళీచేసిన ఆయన్ని కలుసుకుంటే ఆయింటికే ఉండే ఇబ్బందులూ చిక్కులూ తేల్తాయి. “వాళ్ళ ఊళ్ళో, ఇరుకాటం, దోమలూ, కంపూనూ; మా ఊరు రైల్వే కేంద్రం, వచ్చేరైలూ పోయే

రైలూనూ" అని ఒకరు. అంటే యూనివర్సిటీ అనే వస్తువుని ప్రతీరైల్లోనూ కాస్త కాస్త రవాణాచేసి దేశదేశాలా ఉప్పు అందేటట్లు చెయ్యొచ్చునని. "మాఊళ్లో వెనక విద్యాపీఠం ఉండేదిట. ఇప్పటికీ పోనీ పీట చెక్కయితేం ఉంది" అని ఒకరు. "ఎరుగుదుంలెండి, తెలుసు తెలుసు, దగ్గిర ఉండగానే సరిగాదు, మా ఊరికి కొద్దిదూరాన్ని ఒకవిశ్వవిద్యాలయం ఉండేదిట. దానికేం: మాఊరికి పడమట 'కృష్ణవేణెమ్మ,—పావని—ప్రవహిస్తోందిలెండి." "మాఊళ్ళోనూ ఇప్పుడున్నది కోటగుమ్మం అయిపోయింది లేకపోతేనా: ప్రవహించు (మా) 'పీటి పశ్చిమప్రాకార మొరసి గంగమ్మసాగరము కొమ్మ, అందుం లెండిమరి. మాఊళ్ళో ఆనకట్టుందిలెండి" మా ఊళ్ళోనూ ఉందిలెండి. "మా ఊళ్ళో వంతెన గట్టిదిలెండి, రైలుగబగబానే వెడుతుంది, మీకు మల్లేకాదు." "మా ఊళ్ళోదీ కొంచెం జంకిస్తేమిటి! ఇండియాలో రెండోదిలెండి పొడుగువిషయం." "మీ ఆనకట్ట వంతెనకి కింద లెండి, ఆగండిమరి." "మాకు లైబ్రరీ ఉం...పోనీలెండి ఆగండి." కొందరు కొందరు "అన్నీ బాగానే ఉన్నాయికాని. ఆ ఊరుదూరం, ఫలానా ఊరు దాటించి యూనివర్సిటీ పెడితే మీకూమాకూ చెల్లే, మమ్మల్ని ముట్టుగోకండి, డిళ్ళ" అని గునుస్తున్నారు. 'దూరం' అంటే, దూరం ఎవరికి? ఊళ్ళకి ఊళ్ళు సకుటుంబ

సపరివారంగా బయలు దేరతారా ఏమిటి చెప్మా ఆంధ్రులు, ఆంధ్రాయూనివర్సిటీ డిగ్రీలకి! ప్రపంచం మొత్తాన్నించి జనాన్ని లాక్కోవలసిన యూనివర్సిటీకి దూర మేమిటి? విద్యకి దూరం దగ్గరా లేదు. ఎంచేతంటే, అది మనస్సుది, మనో వేగం అందరూ ఎరుగున్నదే! సంగతి చెబుతూ, "16 గం టల రైలుప్రయాణం పట్టే దూరం ఓ దూరమా విద్యకి?" అని ఒక జ్ఞాని ఈ మధ్యనే అన్నాడు. కొందరి ఊహ, యూనివర్సిటీ ఓ పెద్ద పళ్ళగంప అనీనీ, ఏ ఊళ్ళో పెడతారో ఆ ఊళ్ళోవాళ్ళంతా ఎవడిచేతికందినమట్టుకు వాడు (నాగ విల్లి పిడతలు లాక్కున్నట్టు) తలోటీ చపాయించేస్తారేమో, దూరాన్ని ఉన్నవాడి గతేమిటీ? అని గావును. ప్రస్తుతం ఆ ఊళ్ళో ఉంటూన్న వాళ్ళందర్నీ ఆబాలగోపాలంగా తాంబూ లానికి పిల్చి తలో డిగ్రీ ఫలప్రదానం ఇవ్వరు. కాని, ఏమిటో ఊరికే భయం! "వాళ్ళ ఊళ్ళో ఉంటే ఒక్కటే స్కూలు. వాళ్ళేంజేసుకుంటారు యూనివర్సిటీ! పనసపండు తెచ్చి పళ్ళెంలో పెడితే తిన్లేని బ్రాహ్మడు దిక్కుదిక్కు చూశాట్ట. విద్యకి అర్హత ఉండాలి, యోగం కుదరాలి. మాఊళ్ళో పెద్ద సామగ్రీ కాలేజీ ఉంది. ఇక్కడ గనక యూనివర్సిటీ పెడితే, మహారాజాలాగ ఉంటుంది" అని ఒకరు. "మా ఊళ్ళో వెనక మహారాజు కాదు, రాజరాజే రాజ్యంచేశాడు" అని ఒకరు. "మా ఊరుపేరు చెబితే విజయం మాకే ఉం డాలి" అని ఒకరు. "విజయమే మాఊరు"– అని ఒకరు.

"మా ఊళ్ళో పెట్టడానికి అనంతకోటి కారణాలున్నాయి" అని ఒకరు. మహాప్రభో! వంశహీనం వద్దు, వరవిక్రయంవద్దూ' సాంప్రదాయంగానసి ముకీ ముడెట్టండి, నాయనా, వెయ్యేళ్ళ పంట. ఇదేం బొమ్మలనోం కాదు బేసిరోజు చూసుగుని వాల్లాడించి పారెయ్యడానికి!" అని కొందరు వృద్ధులు ఇంతా చేసి, కేంద్రాలోచనకోసం మొదట తీసుగున్న ఏడెని మిది ఊళ్ళల్లోనూ కొన్నింటికి అంకుడెయ్యాగా, తేలినమూఁడూ ఉన్నాయే, అవి కేవలం ఇదివరకు గవర్నమెంటు కాలేజీలున్న చోట్లే అయి ఊరుకోడం, ఓగొప్ప రహస్యంలా కనబడుతుంది. కొందరు, ఫలానాచోట అది పెట్టితీరాలీ అని పట్టుపడు తూంటే వేరేకొందరు అది ఫలానాచోట పెట్టకూడదూ అని పట్టు పడుతున్నారు—వోట్లరోజుల్లో ("నాకొద్దు లేవోటు ఫలానావాడికి మాత్రం ఇవ్వనని చేతులో చెయ్యేయ్" కొం దరుజనం తిరిగినట్టు). ఒకకుర్రాడు కొంచెం ఏమన్నా నోట్లో వేసుగోబోతూంటే మరోకుర్రాడొచ్చి "నాకొస్తెట్టవ్, సరేలే! జ్ఞాపకం ఉంచుకో" అని అనేటంత కుర్రతనంగా వ్యాపారం మారడం విని, ఒక ఇంగ్లీషు ఎరగని పెద్దమనిషి ఇల్లాఅన్నాడు: "ఆంధ్రుడికి బుర్రఉంది, అఖండత్వం ఉంది. అదికలిసి ఇదివరకు కనిపించలేదు. ఇప్పటిలో కనిపించేది ప్రత్యేకవ్యక్తుల కృషే. కాని, మనవాళ్ళకి కొంచెం ప్రథమా వేశం కద్దు. అది సోడాకిమల్లే బుస్సుమని పొంగుతుంది. అది తాగడంమల్లే ఈ బుడబుడ ఎక్కువైంది. ఆ ఆవేశంలో సం

ఘాలూ, సమాజాలూ, సభలూ ఏర్పడిపోతాయి. ఆ పిదప ఎవడిదారి వాడిదే. పెద్ద కాన్ఫరెన్సుల్లో తప్పకుండా జరిగేవి మాంచిభోజనాలూ, కావలసిన తఖరార్లూ, కొన్ని ఘాటైన తీర్మానాలూనూ, ఒకగొప్ప పేరట సంఘం ఏర్పడేవరకూ పాకులాడడం, అక్కణ్ణించి మరి పీకులాడ్డమూనూ! తరవాత ఉండాలయ్యాక, పట్టుదలా! అది లేదు. మనఊళ్లో పెట్టారు చూడండి "పేపరుమిల్లు" పొగవెళ్ళే గొట్టంమాత్రం బొబ్బర్లంక దాకా కనబడుతోంది—ఛస్తే ఆడదు. "ఏం డబ్బో శానండి, షేర్లకి" అంటూ ఎంతో అంత ఇదయాడు. అల్లాగ్గా, నష్టానికి ఒప్పుగుంటేనేకాని గొప్పసంఘాలు పడవు. ముక్కలూ చెక్కలూ ఊడగొడితేగాని ఘన పదార్థాలు అతుకోవు. శుద్ధన్యాయం ఎక్కడా ఉండదు. భూమిమీద అన్నీ అంతరాలే. యూనివర్సిటీ పెట్టడం విషయం శుద్ధన్యాయం జరగాలంటే, అసలు పెట్టకూడదు. పెట్టితీరాలీ అంటే నాలుగు పద్ధతులు చెప్పచ్చు: ఏకంగా చెప్పాలంటే (అనగా (One dimension లో) ప్రతీవాడి హృదయంలోనూ యూనివర్సిటీ కట్టాలి. చతురంగా చెప్పాలంటే (అనగా Two dimensionsలో)– ఆంధ్రదేశాన్ని విశ్వకర్మచేత వలయంగోయించి, జనంసరిగ్గాపట్టే ఓవలయంలో ఆంధ్రులంతా నిలబడి, కేంద్రమందు యూనివర్సిటీని ఉంపించి మాట్లాడకుండా చూస్తూ ఉండడం. ఘనంగా చెప్పాలంటే (అనగా Three dimensionsలో–యూనివర్సిటీని మొదటే (తరవాత మరికార్యం

లేదు) పూరణం ఉంచినట్టు లోపలఉంచి దానికిపైనచుట్టూ బూరిలాగ ఆంధ్రదేశాన్ని తొడిగించడం. చతుర్వారీగా చెప్పాలంటే (అనగా Four dimensions లో) "ఐన్ స్టన్" గారికి రాసి కనుక్కోవాలి, లేక చతుర్వారీగనక జోడెట్టుగున్నప్పుడు చెప్పాలి.

సరి, తక్కిన కథలోకి వత్తాం. యూనివర్సిటీ సభ సమావేశం అయింది. స్వల్పాలు అయినతర్వాత 'వర్ణాశ్యాలరై జేపను, మీమాంస వచ్చింది. అనగా మాతృభాషలో పాఠం చెప్పడమా మానడమా అనే మీమాంస. అంటే ఆంధ్రుడితో ఆంధ్రుడు ఆంధ్రంలో మాట్లాడాలా వద్దా అనే మీమాంస! కాని ఈ మీమాంసచర్చ తెలుగులోనే కానివ్వండి అని పెట్టిన తీర్మానం పోవడమే నిఖారుసైన ఆంధ్రత్వం. సిద్ధాంతం స్పష్టమే గనక ఇందులో అసలు మీమాంసలేదన్నారు, పూర్వమీమాంసవాళ్ళు. కాని ఇది గొప్ప మీమాంసేను, ఇల్లా పారెయ్యండి అని ఉత్తర మీమాంసవాళ్ళన్నారు. వేదాంతులికి ప్రతీది మీమాంసే గనక గావును! ఆంధ్రుడు ఆంధ్రంలో ఆలోచించి ఆంధ్రంలో మాట్లాడ్డం అసహజం కాదుగాని, ఇటీవల అభ్యాసమో దురభ్యాసమో అలాఅయింది. సరి,

పాపంబులు కర్జములని
యేపున జేయంగ నవియు నింపగు ధర్మ
వ్యాపారంబు లకార్యము
లై పరిణతి బొందెనేని అట్టులు సెల్లున్.

అనగా! ఆంధ్రుల మాతృభాష ఇల్లాంటి చర్చలో ఉండ బోతూంటే ఓఢ్రం, కన్నడం, ఉర్దూభాషల పిల్లలుంటే వాళ్ళకికూడా పాపం వాళ్ళమాతృభాషలో చెప్పద్దా, లేక పోతే బాగుంటుందా? బంతిలో బాలబిక్షం చెయ్యొచ్చునా? ఏడిచేదాని ముగుడొస్తే నాముగుడూ వస్తాడని శాస్త్రంగదా, వాటి మాటేమిటి? అని అప్పుడే వచ్చింది! రాకరాక బ్రహ్మాండంమీద కేసొచ్చి డాక్టరు వెడుతూంటే, "అవతల వాడు విల్లురాశోడో లేదో, నీతో నేనూ వస్తున్నా" అని ఓ లాయరుకూడా డాక్టరు వెంటపడ్డాట్ట. ఆరీతిగా ఉందిది. అదీగాక, ప్రపంచంలో సగం ముప్పాతిక దెబ్బలాటలు ఆంధ్ర భాషనెత్తిమీదే ఊరేగుతున్నాయి. అవి అల్లా ఉంచగా, మాతృభాషలో చెప్పడాన్నిగురించి అఖండులైనవారు గొప్ప అభిప్రాయాలిచ్చారు.

మనం ఇల్లానే ఉంటాం తెలుగులో విద్య చెప్ప గోకపోతే, అందుకని తెలుగు నిచ్చెన ఎక్కి స్వర్గంకేసి వెడదాం రండి అని కొందరు. తెలుగు పట్టుగుంటే వేరేఅడగ క్కర్లేదు, చివరకి సన్యసించిపోవాలి. తెలుగు నిచ్చెనకి మెట్లు న్నాయిగాని కిందికున్నాయి. దిగితే నరకమేగనక, అధమ్మం ఇల్లానే ఉందాం—అని ఒకరు. కొత్త పిండివంటగనక చూర దాల్చి చెయ్యాలి, ఎప్పుడో ఓ అప్పుడు—అని ఒకరు. అంతా మాతృభాష మంచిదన్నవాళ్ళేగాని అందులో పాఠాలు చెప్పిన ఇతర యూనివర్సిటీవాళ్లు లేరు, ముందస్తిగా మనమే ఎందుకు

గోతులోదిగడం!-అనికొందరు. తెలుగుతో చెబితే నవ్వుతారు పిల్లలూ పెద్దలూ కూడాను(బలువు లేకపోవడంవల్ల) నాన్సెన్స తెలుగు తేలిక, కొంచెం గంభీరంగా ఉండాలంటే కాస్త తెలియని సంస్కృతమో తెలియని ఇంగ్లీషో భావకవిత్వమో ప్రయోగించాలిగాని, తెలుగైతే సంగతి అందరికీ తెలిసిపోయి గౌరవాలు దక్కవు-అని ఒకరి తినలో. మాతృభాషే మనకి దిక్కయ్యా, గ్రహించడం సులభం, సూక్ష్మం, 'రే' గారు' 'లార్డులోనాల్డుషే' గారు చెప్పారు-అని కొందరు. అయ్యా, మీకే కాదు, మాకూ ఉంది భాషాభిమానం ఓరికంటె ఎక్కువగా! కాని, అందుచేతే మనభాషని వాడకుండా పెట్టిలో పెట్టి, అది ప్రాణపదంగా నెత్తిమీద పెట్టుకోవాలి-అని మరి కొందరు. వాడి చూడండయ్యా, ఆంధ్రులూ వాడకపోతే అది పెరక్కపోడం అటుంచి చచ్చిపోతుందయ్యా-అనేవారు ఒకరు. ఆం. తెలుగులో మాటలు లేవు, పుస్తకాలు లేవు; తెలుక్కి గౌరవం లేదు; రాజభాష కాదు, స్వంతభాష కాదు; మా స్వంతభాష ఇంగ్లీషే—అని ఒకరు. మన్నన ఇతరత్రా లేదుగనకే మీరేనా మన్నించి వాడండయ్యా-అని ఒకరు. దేశభాషలందు తెలుగు లెస్స-అని ఒకరు. దేశభాషలందు తెలుగు less అని మరి ఒకరు. "నన్ను తెలుగులో చెప్పమంటారు. నవీనశాస్త్రం నాసొమ్మేగాని నోట్లో తెలుగు ముక్క లేదు. తెలుగున్నవాడికి నవీన శాస్త్రం లేదు. రెండూ ఉన్నవాడు, ఓ వేళ ఉంటే, వాడు అలక పాన్పు

దిగడు. నేను తెలుగువాణ్ణాయె; తెలుగు రాదనీ, నేర్చుకోవాలనీ అన్యాడికి మళ్లే పైకి ఎల్లా ఒప్పుకోడం?"-అని కొందరి జీవాత్మలో భయం. కేవలం గృహకృత్యానికీ గుడుగుడుగుంచం ఆడుకోడానికీ గాని, లోకకృత్యానికి తెలుగేమిటి?—అని కొందరు కూకలేశారు. ఆంధ్ర "రాష్ట్రం" ఇచ్చింతరవాత ఈమాటగాని ఈ లోపున ఆంధ్రాన్ని చెప్పడం, ఆనకట్టకి ఎగువున వంతెన కట్టుకుని అంతా దిబ్బవేసేటట్టు చెయ్యడమే-అని కొందరు. స్వాతంత్ర్యాలోచన ఎక్కువవుతుంది, తలకాయిలో పదళవాల్ని మొయ్యానక్కర్లేదయ్యా మాతృభాషైతేనూ—అని ఒకరు. మాతృభాష కేవలం మాతృస్థానం-అని కొందరు. తల్లికి వసంతం కొట్టడం వెనకణ్ణించీ ఉంది లేస్తురూ-అని అనబోయేవారు కొందరు. ఆమాటకొస్తే, మనలో ప్రతీవాడిదీ తలోమతంగనక మతము సమానంగాక, భాషా సమానంగాక, ఈ ఆంధ్ర జాతికి సమాన లక్షణం ఏమిటి మరి, మాటల్లో కుస్తీపట్టు గోడమేనా?—అని ఓ ఆయన. ఆంధ్రులకి కల్చర్ లేదు, అది ఇంగ్లీషు కాలవలో బాగా బుటగలు వేస్తేగాని అబ్బదు-అని ఒకరు. అన్ని శాస్త్రాలూ ఇంగ్లీషులో బోధస్తూంటేనే మన ఇంగ్లీషు ఇల్లా ఉంది, తెలుగులో చెబితే దేశం అసలే తెలుగు మారిపోతుందేమో-అని కొందరు. 'ఇప్పుడు బియ్యేల్నే గణించటం లేదు, అప్పుడు బియ్యేని-వీడు కేవలం వట్టి తెలుగు బియ్యేర్లోయ్-అని ఏడిపించుగు తింటారేమో'-అని కొందరి భయం.

పైగాఉద్యోగాని కెళ్ళినప్పుడు-"నువ్వు వట్టి తెలుగుబిడ్డ్యావి, తెలుగుబిడ్డ్యేకి లేపడీ-అనిదొరగారుకుక్కని ఇస్కూకొలిపితే వరిగెట్టాలి, తెలుగూ తనూను"-అని ఒకరు. బోలెడు లక్షలు చిమ్ముతూన్న హైదరబాద్‌లోనే మాతృభాషీకరణం కటకటలాడుతోంది-అని ఒకాయన. మనవాళ్లు ఇక్కడ కొందరు ఫేలవుతారు అనుకోండి, వాళ్లు మరో యూనివర్సిటీకి వెళ్ళి ఎల్లా చదువుకోడం వాళ్ళంత ఇంగ్లీషు రానప్పుడు?-అని ఒకరు. ఇంగ్లీషుభాషలోని గ్రంథాల్లోంచి లక్షు నేర్చుకోవాలి-అని ఒకాయన, "ఆ. అది ఫ్రెంచితర్జుమో, జర్మన్ తర్జుమో కనుక్కుని ఆభాషలే అఖండులు వెళ్ళి నేర్చుగువస్తే తీరిపోతుంది, మధ్య అనవసరంగా ఇంగ్లీషులో పండితుడైపోయి కూర్చోడం ఎందుకు?"-అని ఒకరు.

"పొట్టకూటికి నేర్చు విద్యలు-పుట్టకేట్లు కదల్చేనా" -అని కవి......"నిను నాఁకటికిఁ గొనిపోయి యల్లక

ర్ణాట కిరాటకీచకుల కమ్మ త్రిశుద్ధిగ నమ్ము భారతీ!"

అనే పోతన్న లుండకపోతారా- అనికొందరు.

ఇట్టి మోస్తరుగా యీక్లిష్టసమస్య హోరెత్తిపోతోంది. తరవాత 'గ్రంథప్రచురణ' అనే సమస్య. యూనివర్సిటీ తనగ్రంథాలు స్వయంగా అచ్చేసి దేశానికి ఆదర్శంగా ఇవ్వాలా, వద్దా? ఇస్తే, గొప్పవాళ్ళచేత రాయించాలా, గట్టివాళ్ళచేతా? లేకపోతే గొప్పవాళ్ళనే ఎల్లానో అల్లా మాటలు పోగుచెయ్యమందామా? అదీకాక, అచ్చువేసుకో

గల తడిఉండి ఇతరపని లేని తెలివిగలవాణ్ణే రాయమందామా ఏకంగా? పోనీ చాలామందిని రాసి పంపమని, కొందరివే స్వీకరించి తక్కిన అబ్బాయిల్ని రోడ్డుచ్చుగోవాం టేమిటా? మనం తీరా ఏదేనా పుస్తకం నియమిస్తే, మొన్నాడు దాని తాతలాంటిది వచ్చితీరితే ఏమిటి చెయ్యడం? భాషాంతరీకరణం అల్లాటప్పా పనికాదుగదా, ఎన్ని ఏళ్లు పడుతుందో! లిక్కికి లిక్కి అక్కడ పెడితే గ్రంథశవాలు తయారుకావా? ఉభయభాషానిధులు కావాలి. ఎవరు? ఒక గ్రంథం సామాన్యగ్రంథం అని మనకు తెలిసీకూడా అచ్చెయ్యడమేనా? లేకపోతే భాషలో ఉన్న మడ్డి క్రిందికివెళ్ళి భాష తేరేవరకూ ఆగాలా?-అనే చర్చకూడా సభవారున్నారు. "గ్రామాంతరోపన్యాసాలు" వగైరా బోలెడు ఇతర సమస్యలున్నాయి. మనం ఆగి, ఆంధ్రా యూనివర్సిటీ వచ్చింతరవాత జనం ఏమనుకుంటున్నారో చూసి, చివరికి వద్దాం.

ఇంగ్లీషు గ్రంథం లేని ఆంధ్రులికి 'ఆంధ్రాయూనివర్సిటీ' వచ్చింది అంటే ఆంధ్రులకి ఏమొచ్చిందోకూడా తెలియడం లేదు. "ఇంకేం, మీపని బాగుంది. ఓమంచి ఉద్యోగం లాగచ్చు" అని ఆంధ్రంలో గట్టివాళ్ళని వారి స్నేహితులు హెచ్చరించడం వింటున్నాం. ఆంధ్రశబ్దం ముందు తగిలించి ఉండడంవల్ల, ఇది, ఇంటింటికీ ప్రతీ వాళ్ళకీ పెట్టేస్తారేమో అని కొందరు పామరులు ఓ ఆయన, "ఏమండీ! మానూతి దగ్గిర ఖాళీగా ఉంటుంది, పోనీ, ఆంధ్రాయూనివర్సిటీ అక్కడ పెట్టకూడదూ, నిక్షేపంలాగ చాపా అదీ వేస్తాను" అన్నాడు "కుర్రాళ్ళకి ఇంగ్లీషున చెప్పిన పాఠం ఇహ ఎక్కటంలేదు.

సమాధానంలో అంశం తెలుగుని చెప్పమంటే, దంచేస్తున్నారు–" అంటారు కొందరు మేష్టర్లు. ఇంగ్లీషు స్పెల్లింగు చాలా తప్పులుగా ఉంటుంటే–'ఆంధ్రాయూనివర్సిటీ వచ్చిందండి–ఇంగ్లీషుమీద అట్టే ఖాతరీ లేదు' అంటున్నారట కొందరు అనుభవశాలులైన విద్యార్థులు! "ఇంగ్లీషుమేష్టర్లకి ముట్టుతూన్న జీతాలు తెలుగుమేష్టర్లకీ, తెలుగుమేష్టర్లకి ముట్టే జీతంరాళ్ళు ఇంగ్లీషు మేష్టర్లకీ ముట్టుతాయిట ఇక్కణ్ణించి ఇహ"—అనుకుంటున్నారు కొందరు. ప్రతీ ఆంధ్రుడూ ఆంధ్రాయూనివర్సిటీ పుణ్యక్షేత్రానికి తీర్థం వెళ్ళి ఓ కొబ్బరికాయ కొడితే నైవేద్యం పెట్టి తనకి సహాంచెక్క ఇస్తారు, ఇవ్వకపోతే దెబ్బలాడి పుచ్చుగోవచ్చు అని కొందరు! "అందరికీ ఉండే లాభంకంటె కొద్దిమందికి ఎక్కువలాభం ఉంటుంది దీనివల్ల" అని నమ్మారు చాలామంది. కొందరి ఉద్దేశం—"మనవాడు పట్టి 'Stay-at home' అనగా గుడిపాము, ఒక్క ఊరూ ఎరగడు. ఏమీ చూడందే అన్నీ చూసినవాడి బులా మాట్లాడతాడు! Which is taller North pole or South Pole? అనే విషయం కూడా జోరుగా లెక్చరు దబాయించే గిరీశాలు బోలెడుమంది ఉన్నారు! అందుకనీ అధమం ఇండియాయేనా తిరిగిరాందే డిగ్రీ ఇవ్వరట, ఈయూనివర్సిటీలో!" అని. మనకుస్త్రీలు మాని యూనివర్సిటీ సాగేసు గతి చూసుకోకపోతే, ఈలోపుగా, ఆంధ్రుడు అనేవాడు లేకుండా గురుపరంపర తయారయితే, అప్పుడు ఆంధ్రంలోనేనా పాఠాలు చెప్పడం, లేక మనకీ మనకీ ఎప్పుడూ కుదరదేమో గనక, అన్నీ అరవం

లాంటి భాషలో చెబితేగాని వీలు లేదని వస్తుందా ?- అని కొందరి సందేహం. ఈ వాదనలు జరుగుతూ డగానే, ఆంధ్ర జిల్లాల అంచులమీది వాళ్ళు ఆంధ్రనామాలు ధరించేస్తారేమో అని కొందరు. ప్రతియూనివర్సిటీలోనూ ఓ గ్రాంథిక భాష (అనగా కంటిది) లేదేలేదు. ఆంధ్రాయూనివర్సిటిలో అల్లాంటి పురాతన ప్రమాణాలుండవుట, నిమిషంలో డిగ్రీ అక్కడ పిట్టించవచ్చు, ఇంగ్లీషు కూడా ఉండదు గనక-అని కొందరు. ఇల్లాగ్గా ఇవీ అంతులేవు.

'న్యూమన్' అంటేనే యూనివర్సిటీ అర్థం అయింది గనక ఆమహాత్ముడి ఉద్దేశాల్తో విరమించుదాం-"ఉపాధ్యాయుడు: అఖండమైన జ్ఞానం, పేరు, ప్రతిష్ఠ, సంభాషణలోనే కనపడే వర్చస్సూ కలిగి ఉండాలి"—అని. యూనివర్సిటీ వారు ఇల్లాంటి వాళ్ళని నిర్ణయించుగునేటప్పుడు అఖండులు కానట్టి ఆంధ్రులూ, అఖండులైన నాన్-ఆంధ్రులూ ఉంటారు. అప్పుడు తగాదాలు ఉంటాయిగా, ఇప్పణ్ణించీ ఎందుకూ ?- "ఇక, విద్యార్థి; విద్యదైవికం, కనక విద్యార్థికి భక్తి ఉండాలి; విద్య పవిత్రం కనక విద్యార్థికి నైర్మల్యం ఉండాలి; విద్య శాంతిదాయకం కనక విద్యార్థికి దయ ఉండాలి. ఇవి లేకపోతే, విద్యార్థి పైన దేవుడికీ, మధ్య తనకీ, చుట్టూ సంఘానికీ ద్రోహి" అని. చదువు చెప్పడానికీ, ఖండాంతరాలకి పంపి చదివించడానికీ అర్హత ఉన్న విద్యార్థుల్ని రేపణ్ణించి ఏరాలి. అప్పుడు తగాదాలు ఉంటాయిగా, ఇప్పణ్ణించీ ఎందుకూ ?—"విద్యముందు మొహమాటాలు కూడదు. డబ్బు, దర్జా, సత్తా ఇవన్నీ విద్యతరవాతే. విద్యఉంటే డబ్బు

లాక్కురాగల్గు కాని, డబ్బుండడం అనేది ఓగొప్ప విద్య కాదు. యూనివర్సిటీ పెట్టి దక్షత చూసుకోవాలిగాని, దక్షత ఉండగదా అని యూనివర్సిటీ పెట్టరు"—అని యూనివర్సిటీవిద్య కోసం ఇచ్చినధనం ఏంజేస్తారో, ఎవడుతింటాడో అడక్కుండాకుడా సహృదయంతో ఇవ్వాలిగాని, తద్దినంకింద గాదు ప్రతిఫలం స్వంతానికే కోరి మరి దేనికేనా దానంచెయ్యాలిగాని, యూనివర్సిటీకి కాదు. కాలేజీ అంటే మనకి అబ్బరంగా ఉందిగాని "లువైన్" అనే పట్టణంలో మేడ కొంప ప్రతీదీ కాలేజీయేట. మనజనం రెండుకోట్లు గనక ముందు చాలా కాలేజీలు పుట్టాలి కాబట్టి, గ్రామభక్తి తగ్గించి, ముందుకి నడవాలి. మొట్టమొదట, న్యూమనే చెప్పినట్టు, "కాలేజీలు యూనివర్సిటీకిందికి రావాలి, కళ్లెం చేతికిరావాలి. లేకపోతే యూనివర్సిటీ అనేది నామమాత్రం, వట్టి మొహార్ఛాసియే కాని వ్యక్తి కాదు, శక్తి కాదు!" శాసన సభ్యుల్లో ఉందిట అంతా. వారు పెళ్ళి పెద్దలతో చెప్పి, సిఫారసుచేసి, యూనివర్సిటీకి కాలేజీల ఫలప్రదానమే కాక మరి ఇతర సంభావనకూడా ముట్టచెప్పించాలి. ఆవిషయంలో అందరూ పట్టుదలచూపడం కర్తవ్యం. క్రియముక్కు, ... "లోకానికి దీని యందు అనురక్తి. సానుభూతి, అనేకుల అప్రయత్న సమ్మేళన, విద్య అంటే అపారమైన తృష్ణ, విద్యసాధి చాలనే కసి—ఇవే యూనివర్సిటీ జీవం." దాన్ని నిలబెట్టడం పూచీ గవర్నమెంటువారి మీదకంటె ముందు ప్రతి ఆంధ్రుడి మీదా ఉంది. నమస్కారం.

---

# తమ్ముడు పెళ్ళికి తర్లీ వెళ్ళడం

అబ్బే, ఏం లేదండీ! ఓనాడు తెల్లవారీ వారడంతో ఓ ఉదయం రైల్లో ఊరికే పిరంగిగుండులా ఊడి పడ్డాడు, మా మేనమామ, కాకినాణ్ణించి. ఇల్లా యింకా గుమ్మం దాటి లోపల పళ్ళేదు, ఆపళంగా హాత్తెరీ అని దొరకపుచ్చు గున్నాడు మమ్మల్ని! "పెళ్ళి పెళ్ళి పెళ్ళి, వ్యవధిలేదు వ్యవధిలేదు" అంటూను. కాళ్ళు కడుక్కోడు, కూర్చోడు, ఆగడు, ఆలోచనతో చనివ్వడు! "శుభస్య శీఘ్రం" అన్నాడు. కళ్యాణం వచ్చినా కక్కొచ్చినా ఆగదు. పెద్దలంతా వ్యాపారం అల్లారెటుచేశారు. ఇహ చూస్తే లాభంలేదు, నడుం కట్టాలి గాని!" అంటాడు. నిజమే ఆమాట. పుట్టడానికి పూర్వంనించీ గూడా అనుకుంటూనే ఉంటాంగా మేనరికం సంబంధం! కాని, మన్లోమాట, మాతమ్ముడూ తమదయ వెల్ల ఏవో రెండు ముక్కలు చెప్పుగుంటూ ఉన్నవాడేగాని వొట్టి రికామీమనిషి కాడు. వాడికీ కో అంటే కోటిమంది అన్నట్టు. వస్తూనే ఉన్నారు, లాంఛనాలు మినహా, కట్నం, ఓ పిల్లికూనదాకా చెబుతూను. ఏంజరిగితేం, మాకు మొదణ్ణించీ దీనిమీదే ఉంది మనస్సు, కానైతే. అందు కళ్లేదూ! ఏదో ఆడపిల్ల వాళ్లం మేం అయినట్టు అతగాని ధోరణికి చెబుతున్నా! మేనరికం అంటే కన్యాప్రదాతకి కాస్తంత స్వరాజ్యం గావును! రెండుమూడుదఫాలు విశ్వప్రయత్నం చేశా

అక్కడికీ—"చెప్పావు కాబట్టయ్యా. కాస్త నిదానించు, గుఱ్ఱం దిగు కొంచెం, మరి. ఇల్లాకచ్చల్లో కంచులు వేయించితే ఎల్లాగు! వెనకా ముందూ చూసుకోసి కావలసిన వాళ్ళమేగదా, ఏదో పైసలు చేద్దాంలే!" - అంటూ పెట్టి ఒక్కరవ్వ కసుకుగున్నట్టు డభాయిద్దాం అని. అయితే అతి నెక్కడ? అబ్బే! ఉహుం. తను చెప్పేదేదో అదేగాని, తెద్దయినా మామాట చోరనియ్యాదే! మళ్ళీమాట చెప్పడం సొంపు మా అందరిదగ్గిరా ఉంది ఉంటే? ఏమీ! అతడు వినిపించుకోందే! సరేం! పైగా, మేనమామ ఓ వేళ మాట్లాడ్డాని కాతడు మాకు తెంపిచ్చినా మేం అతణ్ణి నెగ్గగల్తుమా? అమ్మయ్యా! ఏదో ఆ భోజనం చేసేటప్పుడు ఆ ఆసామీ ఏం తమాయించాడోగాని, అస్తమానం ఒక్కవరసగా ఉన్నాడూ, మరొక్కవారం ఉంది ముహూర్తం అని కాయితంమీద రాసిచ్చాడు లగ్నం అదీనీ, ఆమధ్యాన్న వేళ రైల్లోగావును వాళ్ళఊరు నిష్క్రమించాడు.

అవునా! ఉన్నామాట అనేస్తే. తీరిపోతుందీ, నాకు మాత్రం మా పెద్దతట్టుగా తేసుకొచ్చింది, చెప్పద్దూ! కాని ఏమిటి చెయ్యడం! పెద్ద వాడూ! మరోటీ, అతనన్నదీ నిజమే! శుభశోభనాదులన్నీ ఏదో చకాపికీగా గబగబా హైరానగా అయిపోతూంటాయిగాని, ముందెంత గుణించుకు కూర్చున్నా సరే వీటిల్లో స్థాయిగా ఉండడం బహుఅరుదు. ఒకసారి నేను కూడా అర్థ ఆలోచించాను. "ఇక పెళ్ళికీ,

వదుక్కోఅంటూ ఇంతంతా ఇంతంతా లేరుమనికి చెల్లెళ్లూ తమ్ముళ్ళూనూ! చెల్లిన్ని అత్తారింటికి వంపేశాం, తమ్ముళ్లు ఈవరకే సంతానవంతులయ్యారు; ఎటొచ్చీ ఇహ నాలుగో తమ్ముడు వీడొక్కడూనూ, వీడుకూడా ఓ యింటివాడవడమే గదా మనం కోరేదీనూ. ఊహూ, మంచి చెడ్డలు చెప్పడానికి మాత్రం దగ్గిర పెద్దవాళ్లెవరున్నారు గనకా" అని తలపోసుగుని, నేను మనసు నిబ్బరం చేసుగుని, నాస్నేహితుడు ఒక మేష్టరు మా భవనంలోనే మరోభాగంలో కాపరం ఉంటే ఆయన్ని తక్షణం కలుసుగుని, హైసా అని ఆయనా నేనూ కలిసి పట్టు పట్టుకుని కొన్ని కొన్ని ఖంజాయింపులు చేసుగుని, రివ్వున వెళ్ళి ఉత్తరాలెత్తిచ్చి, మాతమ్ముళ్లకీ పెత్తండ్రిగారికీ, కడమా బంధుకోటికీ, ఈసంగతంతా గోకేసి ఆహ్వానంరాసి, నుంచున్న పళాన్ని వాళ్లని యావన్మందినీ యకాయకీని బయల్దేరి వచ్చివాలమని, పెళ్ళికి ఓ ఇదనీ ఓ అదనీ ఆడవాళ్లు పురమాయించిన మీదట ఏవో బజార్లో కొనుక్కొచ్చి ఇంట్లో గిరవటేస్తూ, ఆ ముహూర్తానికే కాకినాడ వెళ్ళడానికి ఆయత్తపడడం వెంటనే ప్రారంభించాం.

పెద్దవాళ్ళు కార్యాకరాలు ఎల్లా శాసనసాగించుతోచ్చారోగాని ఆనాలుగు రోజులూ మా కేమన్నా ఊపిరి సలిపిందా, కాళ్ళు విరగదొక్కుగున్నాంగాని! ముహూర్తం అనే మాటలో ఉంది ఎంత సొగసైనా! అది మానవులే

పెట్టుగాని, అదొచ్చి మీదపడిందంటారు. దాని బలిమి! ఏం బలిమి డబ్బు కుదురుతుంది పీలు కుదురుతుంద, మనసు కుదురుతుంది, చాలామందికి జలుబు వొడలి రోగం కుదురుతుంది, జరిగిపోతుంది! సంబంధించిన పునిస్త్రీలకి నెలలు నిండడం గాని, సంబంధించిన ముసలమ్మలకి ఏళ్లు నిండడంగాని జరక్కుండా ఉండాలిగాని, ముహూర్తం మానవులకోసం ఆగదు. ముహూర్తాలంటూ పెట్టకపోతే, మన్లో ఉండే విధ్యుక్త కార్య నిర్వహణానికి ఒక పెళ్ళీ పడకనే పోను అసలు! ఈమాట అందరికీ తెలుసు. అంచేత దూరపు బంధువులైనా అశ్రద్ధలు చెయ్యరు. చేసినా పాకెన్న దాట నివ్వరు. కావలసినవాళ్లు పిలుపందక పోయినా రాక మానేలేరు—వచ్చి తమరికి సరైన పిలుపే లేదని చెప్పడం గునవడమూనూ! గునవడానికి బాగా సావకాశం ఉండే నిమిత్తమే పెళ్లి అయిదు రోజులంటూ ఏర్పరిచింది అని కొందరి ఊహ. సరి, మావాళ్ళూ నాఉత్తరాలు చూసుగుని సెలవ చీటీలు రాసిపారేసి ఆమట్టున చక్కావచ్చారు. క్రితం నాడు మధ్యాహ్నానికప్పుడే మా పెత్తండ్రిగారూ వాళ్ళ వాడూ పిల్లలూ అంతానున్నా నిమ్మ నిమ్మళంగా ఒకొక్కరే నా అన్న వాళ్ళంతా జేరుకున్నారు ఎల్లాగైతేం! ద్వారబంధానికి తోరణంగట్టి, పెళ్లికొడుకుకళ్ళకి కాటికా, బుగ్గని చుక్కా పెట్టేటప్పటికి వొస్తుందిగావును పెళ్ళికళ. ఆపళంగా అదివరదాకా సంసారపక్షంగా ఉంటూన్న ఇంటిల్లపాతి

జనంలోనూ ప్రతీ నస్మరంతిగాడూకూడా గొడ్డలిపెట్టుగా ఒక గొప్ప మొగపెళ్ళివాడుగా మారిపోయి ఊరు కుంటాడు. అక్కణ్ణించి అడుగులు లెక్కెడుతూ నడిచే వాడొకడూ, నిద్దరోతూ మాట్లాడే వాడొకడూ, అభోజనం పడుకుంటానని గడ్డంపట్టించుకునే ధీరోదాత్తుడొకడూ, తాను భంట్రోతంటే తనకి భంట్రోతినే ఘరానావాజమ్మ ఒకడూ, "అబ్బ? వాణ్ణాళ్ళమందూ, దుక్కలాడున్నాడూ! "అని ఎగేసే మందుడొకడూ ఆవిర్భవించడంవల్ల వ్యాపారం తారుమారవుతుంది. కాని, సందడిఅంటే అదే సదండిలెండి మరి! "ఈదార్లో తుంగ చాప పరిచా రెవరూ?"—(ఎవడు చెబుతాడు సమాధానం?) "ఈటముకు పెట్టి ఎవరి దగ్రా, కాలు బద్దలవుతూనూ?" "ఏమర్రా, మూడుకోతల దంతపు దువ్వెన్న చూడలేదుకదా, మీరెవరూ?" "ఇదుగో చూడూ! నాపట్టుతాపితాలు ఎక్కడున్నాయి! ఇయ్యా, అవీ మరచెంబూనూ!" 'ఈ వెధవని తియ్యవే ఇక్కణ్ణించీ, తీసి నీళ్ళట్రా" అంటూ అనవరతమూ కేకలు వినబడతూ, చంటిపిల్లల గుక్కట్టడాలూ, కాస్త పెద్ద పిల్లల అల్లర్లూ— పల్లకీలో కూర్చోడానికి తగూలూ, గాయికం వచ్చినవాళ్ళు మొత్తుగున్నా వినిపించుకోకుండా పేకాటలూ, ముసలివాళ్ల కూకలెయ్యడాలూ లాంటి వాటితో నిండిఉండే అప్పటి ఆ వైభవం సంసార సౌఖ్యసారం అనచ్చునేమో! చెప్పొచ్చే ముక్క, మేమంతా ఇంకా ఆడపెళ్ళివారి ఊళ్ళో వాళ్ళే

ర్పాటుచేసే విడిదిలో దిగకుండానే, ఇక్కణ్ణించీకుండా తయారు గానే ఉన్నాం. ఇంతంతగలిభీ, హడావిడీ జరిగిపోతూంటే పైవాళ్ళమైతే మహ చెడ్డ సొగసుగా చూడచ్చు! కాని ఎవరో ముగ్గురో నలుగురో నడుంకట్టి వ్యాపారం అంతా చక్క పెడుతూ, అడిగినవి ఇవ్వడానికీ, ఇచ్చినవి అమర్చడానికీ, అమర్చినవి ఉపయోగించడానికీ, వెన్ను వాల్చడానికేనా తీరిక లేకుండా యెముకలు పొడుంగావలసిన వాళ్ళు ఉండి తీరాలిగా! ఇక్కడ ప్రస్తుతం నే నల్లాంటి వాణ్ణి. ఇహను ఆ తెల్లారకట్ల అయిదుగంటల రైలుకే ప్రయాణం అంతా పడు కున్నారు. నేను వీలైనప్పుడల్లా ఓ కునుకు లాగుతూ లేస్తూ గడిపాను. మాఆవిడ మాత్రం—మరి పెద్దలు ఇంట్లో లేరుగా మరీ!—రాత్రల్లా చిమ్మెటల్లా ఏదో సవిరిస్తూనే ఉంది; సవిరింపు తెమల్నే లేదు.

ఇక ప్రయాణ సరంజాకల్లా మూలం మావాళ్లు నాలుగుబళ్ళు చెప్పొచ్చారు. చెప్పొచ్చీ, ఇహ తమ నిద్దర సంగతేగాని మరి బండీవాళ్ళ అతీగతీ కనుక్కోలేదు. వాళ్ళా చాలసేపు అరిచారట, ఆగారట. ఎంతైనా తం టాలు పడ్డారట. కాని ఛస్తారా ఏమిటి, ఫికర్లేకపోతే! ఆతర్వాగా విసుగేసుకొచ్చి వాళ్ళు మాయమై చక్కాపో యారు. ఈసంగతి నాకు నాలుగు గంటలకి మెలుకువ రావ డం ఏమిటి, తెలియడం ఏమిటి, రెండూ ఓమాటే జరిగాయి! బండీవాళ్ళ పిలుపులు వినిపించు గోనందుకు నాకు చప్రమని

పోయింది—నేనైనా తప్పని సరివల్ల కోప్పడతానుగాని, నేను మాత్రం వినిపించుకుగో కూడదూ!—ఆగి, అప్పట్లో కడం వాళ్ళ నందర్నీ లేవగొట్టడం శక్యం అయిన పనిలా కనపడక తీరా రైలు దాటిపోతే (అందర్నీ కదుపుకుని వెళ్ళేటప్పటికి), మళ్ళీ స్నాతకం అడ్డుతుందేమోగదా అని హడలెత్తి, "పోనీ, కొంతమందిముందు వెడితే!" అనిపించిందినాకు. సరి, పెళ్ళికొడు కోహడూ—పెళ్ళికి పెళ్ళికొడుకూనా అన్నట్టు—నేనూ, మావా ళ్ళూ వెళ్ళి తీరాలిగా! తక్షణం, "రైలు వేళయింది లేవండ ర్రోయ్" అని ఇంట్లో మేఘధ్వనిఓటి ఖర్చుపెట్టి, మేంముగ్గురం ముఖ్యం అనుకున్నదీ, చేతికి అందిందీ ఊడిపుచ్చుకుని, రైలు స్టేషన్కి ఎగడ్డాం. కొంతరంగం ధౌడు తీసేటప్పటికి, ఓ ఒం టెద్దుబండీ మనికిపాట్లు పడుతూ మాకు ఎదురుపడితే అది బేరం లేకుండానే వెనక్కి స్టేషన్కి పట్టుమన్నాం. ఎట్లానో బాధపెట్టగా, వాడు ముందుబరువూ, వెనకబరువూ, అసలు బరువూ అంటూ మమ్మల్ని కొంకుక్కతినేసి అపీషూస్టే షన్కి ఈడ్చుకుపోయాడు. స్టేషన్లో ఊహూ కోలాహలం బయల్దేరింది—ఇటోటీ అటోటీ రెండు రైళ్ళున్నాయిలెండి, అప్పుడే! మా రైలు కర్ణశూలంవంటి రాక్షసికూత ఓటి ఎక్కడకూసి తోక ముడిచేస్తుందో అని నాకు ఓ బెంగ! "డబ్బిచ్చెయ్యండి బాబుగోరు, యెల్తాను!" అని బండీ వాడు. వాడగ్గిర చిల్లర్లేదు, "ఉండరా, టిక్కట్లు కొన్నతర వాత నీ డబ్బు నీ మొహాన్ని కొడతానూ?" అన్నాను.

అంటే వాడు అల్లా ఎగ్గాగండీ అని బలవంతపెట్టి, నుంచున్న పాట్న కక్కమని కూర్చున్నాడు. "నీ మొహాం దగలేసిరి గడరా, నీమొహాం దగలెయ్యా!" అనుకుని, గొడుగుం టేను చేతులో, అదివాడి మొహాంమీద కొట్టి, "ఇది చ్చుగు ఏడవరా. డబ్బిచ్చిందా కానూ!" అని నేను నోటు పైకి తీసి పరిగెట్టి. కిటికీదగ్గిర ఉల్టాసీదా అంతపని జరిగి, ఎల్లానో మూడు టిక్కట్లు కొయించాను. మూవాళ్ళిద్దరూ మించి పోయినట్టు స్టేషన్లోకొచ్చి దిక్కులుచూస్తూ నిల బడ్డారు. ఇంతట్లో నేను చిల్లరట్టుగుని "ఇదుగోరోయ్" అంటూ బళ్ళదగ్గిరికి వెళ్ళేటప్పటికి, ఏడీ బండీవాడూ? ఈ భూప్రపంచంమీద లేకుండాపోయాడు. "నాలుగుంబావలా కిమ్మతు అసలుబుట్టమూర్కది, నిక్షేపంలాంటి గొడుగు, నీపొట్ట నెట్టుగున్నావుట్రా, నీపొడుగు బొగ్గులుగానూ!" అనుకున్నాను. అనుకుని, మూవాళ్ళమీద కొంచెం చిర్రు బుర్రుమన్నాను, వాడికోసం ఎల్లానూ బయద్దేరిన కోపాన్ని నిరర్థకంగా అంతరించి పోనీకుండాను!

ఇంతట్లో, ఇంటిదగ్గిర నాకేకతోటి మూవాళ్ళంతా పొగేస్తే తేనిపట్టు రేగినట్టు ఒక్కమాటు చలించారట. ఓముగ్గురు తెగ తిరిగి నాలుగు వీథులూను, బ్రహ్మాండం మీద రెండుబళ్ళు సమకూర్చి యింటికి తెచ్చి వాటిల్లోకి పెళ్ళివారిసామాన్ని పెళ్ళివాళ్ని చిటికెలో రవాణాచేసి పారే శారట. ఇహా బయద్దేరపోయే సమయాన్ని కరకమ్మగారు

తనతల్లిని తీసుకుని, ఓ ట్రంకుచ్చుకుని, ఓ అరటిగెల వేసుకుని కాకినాడ తనూ వస్తానంటూ వాళ్ళకి అడ్డంపడిందెట. కర కమ్మ మాకు చుట్టం కాదు పక్కం కాదుమ్మండి, మాహా వేళీ లోనే ఉంటూన్న పొరుగావిడ. క్రితం ఆర్నెల్లనించీ ప్రతి నిత్యమూ ఆవిణ్ణి చూస్తోచ్చినా, ఎప్పుడూ సంబోధించలేదు. వినడం ఆవిడ దొడ్డమనిషే అని మనిషి ఊరికే సన్నంగా కుదురులా పేనులా ఉంటుంది, నిజమేనండీ, ఉత్త అటుగ్గింజ, పాపం! కాని, కట్టె పీలిగా ఉంటేం, గాత్రంమాత్రం మహా గట్టిది గావుకేక లెట్టడానికి. కాయ శరీరం ఏమో, ఆవిడ అనేక పుష్కరాలకి కోటిలింగాల రేవులో స్నానంచేసింది. ఆవిడికి ఓతల్లి! ఈవిడికి కన్నూ కాలూ కొంతవరకే ఉన్నాయి గాని, మడీ ఆచారం మట్టుకు చెక్కుపూటుగా ఉన్నాయి. వీరికి ట్రంకుట! అబ్బే, ఎంత ట్రంకండీ, నా మొహం! ఉత్త మన పెద్దబాలశిక్ష పుస్తకం అంతాయె. పైపెచ్చు ఓచిన్న అరటిగెల! వీళ్లు ఎక్కడికక్కడికే అని పెళ్ళివాళ్ళతో తెల్లారగట్టే తయారయారు, సమూహంలో కొట్టుకుపో వచ్చుగదా అని! సరే అనుకున్నారట మావాళ్ళు. అనుకుని ఓ రెండునిముషాల్లో వీళ్ళనీ ట్రంకుని అరటిగెల్ని సర్ది ఎక్కడోను బళ్ళు తోలుకుని మేహాలమీద వచ్చిపడ్డారు స్టేషన్కి! గుడ్డిలో మెల్ల, ఇంకా మాత్రైలు కదల్లేదు. వస్తూనే, మారెండో తమ్ముడు నాదగ్గర కొచ్చేసి, "మేష్టారు సాయంత్రం వస్తానన్నాడు. మనకి పన్నెండు టిక్కెట్లు కావా

లన్నయ్యా!'' అన్నాడు, ''సరే, మీరెళ్ళి సామాన్తో రైల్లో పడండి!'' అని నేను అదివరలో కిటికీదగ్గర మోచేతి తోపిడీల్తో టిక్కట్లుకొన్నవాణ్ణి ఇప్పుడు లోపలి కెడితే ఏదో మహా పొడిచేస్తాగన్నట్టూనూ, మనకీ ఉద్యోగ్యమేగదా టిక్కట్లగుమాస్తా నన్ను మన్నించకపోతే యెరగడా మన మజాకా అన్నట్టూనూ, గిరుక్కునతిరిగి లోపలికెళ్ళి, ''అయ్యా! దయచేసి కాకినాడకి పన్నెండు!'' అని జాతిభాషగా అడిగి, ఆ టిక్కట్లూ చిల్లరా బహు నమ్మకంగా—మళ్ళీ పల్లెటూరి గబ్బిలాయికి మల్లే తిరిగీ లెక్కపెంటుగుంటూ కూర్చోక—జేబూలో వేసేసుగుని, ఏదో గొప్పదిగ్విజయం చేసినట్టు గ రాగరీగా ఇవతలకి వస్తూంటే ఒకడు ''అయ్యా! ఈ టిక్కట్టు ద్వారపూడికేనా చూసి పెట్టండి!'' అని నన్ను కనుక్కునేటప్పటికి నేను ''అయ్యో! పిచ్చి పుల్లాయిలా ఉన్నావేమిటి ఎక్కడో! అక్కడికే!'' అంటూ వాడిఅతిజాగర్త అసహ్యించుకుంటూ చక్కాపోయి, మా వాళ్ళంతా బండిలో పడగలిగినందుకు ఆనందపడి, ఇహ రైలుకూసి పొగ వొదిలి ముందుకు సాగే వేళకి నేనూ ఎక్కేసి పెట్టితలుపేసుగుని, ''అమ్మయ్య'' అనుకుని లోపల కూర్చోపడ్డాను.

రైలు ''ఆఁ నేను వెళ్ళను'' అన్నట్టు కొంతహారామీ చేసి వెనక్కి కదలడం మొదలెట్టింది. ఆపళంగా రైలువాడు ''ఏడిశావు, నడుద్దూ, నీయిష్టంఏముందీ!'' అన్నట్టు చెవులు

గింగురెత్తేలాగు రైయ్యిమని గావుకూత ఓ కేసి, రైల్ని నసాళం అంటేటట్టు ఒక్కటేశాడు. దాంతోటి పాపం రైలు నెమళ్ళకక్కుకుంటూ పరిగెత్తడం మొదలెట్టింది. కావలసినంత బలంఉంది రైలుకి! ఉంటేం? అన్నిపుట్ల ఇనప సామగ్రీకూడా ఒక్క నరమానవుడు ఎల్లాచబితే అల్లావింది, వొదిలిపోయింది. నాకేమైంది? రైల్లోపడ్డానికి కామా సవాళ్ళ తొక్కుళ్ళాటా జరిగిందీ. ఆపట్టున కిటికీలోంచి కొడుతూన్న ఆప్రభాతమందపవనం ధర్మమా అని కళ్ళు ఇట్టేమూతడి ఊరుకున్నాయి. నిద్దర, కూర్చున్నప్పుడు, మరీ వొస్తుంది, ఒక్కొక్కప్పుడు కూర్చుంటేనేగాని రానేరాదు, దాంతగత్తయ్యా! అల్లాగే కాస్సేపు జోగి, ఓ తథరకా, ఆ కునికిపాట్ల పికారులో నేను మరీ జోరుగా కుడిపక్కకి ఒసితేసరికి గభీమని మెణుకువ చక్కావచ్చి, "ఎక్కడికొచ్చాం?" అన్నాను. అంటే "ద్వారపూడి దాటాం!" అన్నాడు మా పెత్తండ్రి గారివాడు. ఏమోగాని, "ద్వారపూడి" అనేది చెవిని పడ్డంతోటే నాకు మహాభయం వేసిపోయింది చెప్పద్దూ! అప్పుడే రొండోమాటు వినడం మరి ఆపేరు. అనేంజేశాడూ మావాడూ! నేను పైనతగిలించిన కోటు జేబులో —పోడుంకాయకోసమే అని జ్ఞాపకం—సమ్మోణంగా చెయ్యో ట్టాడు. పెట్టేటప్పటికి టిక్కెట్ల దొత్తర తగిలింది; యాదాలాభంగా అది పైకితీశాడు అప్పటికి తెల్లగా తెల్లారింది. తీసి చూసి, "ఇదేమిట్రా;. ద్వారపూడీ!" అనిచదివాడు.

-అయ్యో చెబితే మీరు నమ్మరూ! నాకు ఒళ్లు నీరైపోయి ఉపద్రంగా భయం, దారుణంగా కోపం బయద్దేరేయి. వాడు, సరి ఆ టిక్కెట్టు వెనక్కి పెట్టినతరువాత దానికేసిచూసి "ద్వారపూడి" అనిమళ్ళీచదివాడు. "టిక్కట్లమ్మేద్రోహిగా, ఎంతపని జేశావురా, నీమొహాన్నిజీడెట్టా!" అనుకున్నాను. నాకళ్ళు చింతనిప్పులయిపోయాయి. మావాడూ ఒక్కొక్క టిక్కట్టే తీస్తూండడం చిలకిచెల్లే "ద్వారపూడి, ద్వారపూడి" అని చదువుతూండడం లంగించుకున్నాడూ! అల్లా పన్నెండు టిక్కట్లు ద్వారపూడికని చదివాడు. చదివి, "ఒరేయి ఇంకా మూడు ఎక్కువఉన్నాయి యెందుకురా?" అన్నాడు, అనీ. అవిమూడూ కాకినాడకని చదివాడు. అంతాకూడా ఊరికే విస్తుపోయి ఊరుకున్నారు మా రొండోతమ్ముడు నాకేసితిరిగి "ముందొచ్చిన మీ ముగ్గురికీ టిక్కెట్లు పుచ్చేసుగున్నావా ఏమిట్రా లేదనుకుని నేను పన్నెండు చెప్పానూ!" అంటూ సర్దడం మొదలెట్టాడు. "ఏశిసినట్టే చేశావు! ఇంతే పన్లు! దమ్మిడీ సాయంలేదు. మా గొడవెందుకూ, తరవాతొచ్చిన స్వరూపాల సంఖ్య నే నడిగితేనూ!" అని నేను లేచాను?

"ఒరేయి, నువ్వూ చదువుకున్నవాడివేగదా! నేను 'పన్నెండు' అనేటప్పుడు "నేను ఇల్లాఇల్లా మా ముగ్గురికీ టిక్కట్లు పుచ్చుగున్నాను. కడంవాళ్లెందరు?" అని నాతో చెప్పి మరీ ఆడగద్దుట్రా? అది చెప్పద్దా! పానీ, ఎవోకొన్న వాడవు ఎల్లాన్నూ కొన్నావుగనక చూసుగోవద్దా, అవి ఎక్క

డికిచ్చాడో!" అంటూ మా వాడు అందుకున్నాడు, "ఏముంది వొట్టి భడవా" రకం, తెలివిమద్దెపు దద్దమ్మలు వీళ్లు?" అంటూ క్రురాళ్ళమీద నేను! "నీ పెద్దతనం మట్టుకు? ఉన్నమాట మనస్సులో పెట్టుకు ఇదయ్యావు" అంటూ వాళ్ళు. ఇంతలో ఆడవాళ్ళు, "ఇందులో తక్కువ తిన్నవారెవరు? అందరి ప్రయోజకత్వాలూ ఒక్క టాకీగానే ఉన్నాయి, అడగాలీ వేరేను!" అని ఈసడింపులు మొదలెట్టారు. నాకు రాపణా రేచిక్క వేసింది. అంతా స్వజనం అయిపోవడంవల్ల ఊరుకున్నానుగాని, లేకపోతే ఒక్కొక్కర్ని ఇల్లా చీ రేను :మను.

రెండో కంటివా డెరక్కుండా, గుడ్ల నీళ్లు కుక్కుగుని, ఈ సంగతి కప్పెట్టేసి పైకి మామూలుగానే కనపడ గలిగితే వ్యాపారం దివ్యచకోరంగా ఉండేది, సరిపోయేది. కాని అబ్బే మేమా! వాద ప్రతివాదాలతో పోరు జోరై పోయింది. రైలు చప్పుడు చప్పపడిపోయింది. రైలు ఆగిందో, నడుస్తోందో, బోల్తా వేసిందో కూడా మాకు నిమిత్తం లేకుండా పోయింది! గొడుగాపాయె టిక్కట్లూ మూడు దండగాయె. కడంవా ద్వారపూడికి తగులడ్డాడాయె, వాడి ద్వారపూడి దొంగల్దూరా! ఓలై తేవమద్దుం! అక్కణ్ణించిచాల్లే తెలివి'చాలే తెలివి' అనుకుంటూ, 'నీమూలాన్నే' అంటే 'నీమూలాన్నే' అనుకుంటూ ఒకరి మీద ఒకరు నేరం మోపుతూ, అడ్డమైన హడావిడిలోనూ పడిపోయాం. రైలెప్పుడో సామర్ల

కోట స్టేషన్లో ఆగి ఊరుకుంది. ఉత్తరక్షణం లోతుర్ధ ఖంగా రుతో, లోపల గొణుగుళ్ళు, పైకి ఉలుములు, రుసరుస, తీవ్రంగా చూపులు, చేతులో వస్తువు నేల నెట్టికొట్టడం— వీట్లతో అతి కోలాహలంగా కొందరం దిగి ఆడవాళ్ళనీ పెట్టెల్నీ దింపడం ఇల్లామొద లెట్టామోలేదో ఇంకా, ఆప శ ంగా యమకింకరుడులాగ బాగా ఓ తాడి చెట్టంత మని షైతే చక్కావచ్చి—మా సంగతి వాడెల్లా విన్నాడో, విన కుండా పసిపట్టాడో ముందావాడు—ఊ దివుచ్చుగు లెంపకాయ లాగినట్టు, "టిక్కెట్, సార్" అన్నాడు నన్ను. ఇంకా మేం దిగీ దిగకుండా ఉన్న అవస్థలో ఆఫీసరునైన నన్ను ఒక అల్పుడు ఇల్లావొచ్చి దుయ్యబట్టుగోనా అని నాకు పట్టరాని రోషం వచ్చింది. అయితే మాత్రం, రోషాలుపనికొస్తాయీ, ఆ వేశాలు పనికివస్తాయా చేతులారా చేసుగున్న తరవాత, చెప్పండీ! అప్పుడు, నేను టిక్కట్టు ఉన్నవాడి బాబులా నటిస్తూ ధిమాకీగా చిరునవ్వుతో, "ఉండవయ్యా! దయ చేసి, దిగనీ ముందూ!" అన్నాను, వాడు తొందరగా ఇం కోర్చి అడగడానికి విరగడై పోతాడేమో అని. అంటే, అబ్బే! వాడెక్కడో దుల్తాడూ! మమ్మే న్నే పట్టుగున్నాడండీ తిన్నగా వచ్చి! ఎల్లాపోల్చాడో, వాడి తస్సాగొయ్యా, వాడి దామరి ప్రజ్ఞ, తక్కినవాళ్ళదా?

పెట్టెలు దింపారు. చివరికి కరకమ్మగారి తల్లినిగుడా కిందికి సాయం పట్టారు. అనగా రైల్లోంచి. దాంతోటి, అరిటి

గెల దిఁపడం పనికూడా అయిపోయింది—అంటే ఆవిడ ఒళ్ళో పెట్టుగు కూర్చుంది కాదూ మరి గెలా! ఇంతలో రైలుకాల కృత్యాలు తీర్చుగుని, ఊగిసలాడి, కూసి విరమించింది మేం, ఇహ, మమ్మల్ని పట్టుగున్న మసిపి దెయ్యాన్ని వొదిలించు గుని కాకినాడ టిక్కట్లగొడవ చూసుగుని ఆరైల్లో వేగిరం వెళ్ళి పడాలీ అనుకుంటూంటే, ఏంజేసిందీ కిరికమ్మగారూ! మాంచి దెయ్యమల్లా చూవ్వా ఈవిడనూ, "అయ్యో, హాయ్యో అమ్మో, హాయ్యో" అంటూ మొదట చిన్న చిన్న కేకలెట్టి అక్కణ్ణించి, ఏమని చెప్పను, ఓ తరవాయి లేకుండా, కూనుస్వరాలుగావు, ఓ దీర్ఘాలు గావు, ఓ రాగాలు గావు, మాదుంప తెంపి పెద్దపెట్టున శోకన్నాలు లంగించు కుంది, కొండ విరిగిమీద పడ్డట్టూ! మామూలుగా నేను కోపిష్ఠినీకాను, ఏతత్పూర్వం ఆవిడతో ప్రసంగించాలేదు. కాని, రంగం మారిందిగా! అక్కడతోటి నేను పళ్ళు పట పటా పిండెల్లా కొరుకుతూ, "నువ్వెక్కడ దాపరించావ మ్మోయ్, మంచి శనిలాగోయ్! నీకేమి ఏక్షేత్తు వచ్చిందమ్మోయ్, నీకేమి ఉప్పెన వచ్చిందమ్మోయ్, అంత ఏడుపు కోయ్!" అంటూ కుక్క తిరక్కుండా గర్జించడం మొదలె ట్టాను. "టికేట్ టికేట్" అంటూ టిక్కట్ల సైకాను సలపాదించడం మొదలెట్టాడు! "నాభవిష్యం అంతా మట్టి కొట్టుకు పోయిందండోయ్! నా వెండిబంగారాలకీ నాకూ ఎడబావులు వచ్చాయండోయ్! ఇంతమందున్నారు మళ్ళీ,

ఆ స్త్రీపిట్టలాగ లేచి పోతూంటే పట్టుగోలేక పోయారండోయ్! అంటూ కరకమ్మ మరీ గోల చెయ్యడం మొదలెట్టింది. పిట్ట కొద్దీ కూత ఘనమూ అన్నట్టు ఇంతంత పోలికేకలూ నాటు మేకులాంటి చిన్న కరకమ్మ వెయ్యగలదని నేను లోగడ ఎరుగున్న వాణ్ణే కానైతే. అప్పట్లో పోనీ అది పబ్లీకు స్టేషనుగందా కాస్త వడితగ్గించుతుందేమో అని భ్రమించాను. భ్రమిస్తే హెచ్చించింది తస్సాగొయ్యా. నాకు వాళ్ళ భగ్గుమని రవిలి పోయి ఆపై పజ్జములో నేనూ అందుకున్నాను. అందుకని, "నీది పోయిందేమిటమ్మోయ్, అసలోయ్! మాతో ఆ మాట చెప్పి తగులడవమ్మోయ్! శుభానికి వెళుతూ మాకు నీ ఏడుపు బాజాలేమిటమ్మోయ్! ఓఘాయిత్యం కూడానూ! నువ్వేమిటమ్మా మా కోయ్! పెళ్ళికెడుతూ పిల్లిని చంకనెట్టుకు వెళ్ళినట్టు నిన్ను పట్టుగొచ్చారేమిటమ్మోయ్, మా వాళ్ళోయ్! పెళ్ళిలో దెబ్బలాటలు పెళ్ళికొడుక్కీ పెళ్ళికూతురికీ తప్ప కడంవాళ్ళందరికీ నమ్మోయ్!" అంటూ జ్వాలాతోరణంలా చెల రేగిపోయాను. "నాటముకు పెట్టె రైల్లో కొట్టుకుపోయిందండోయ్, అందులో ఉన్న రొండు వందలకీ తిలోదకాలైనా యిండోయి" అని కరకమ్మ బాహాటంగా ఏడుపు సాగించి, నెత్తి బాదుకుంటూ చెప్పడం మొదలెట్టింది. సరి, యీ యేడుపులో తల్లి కూడా మూలుగుతూ మద్దత్తైంది. మద్దత్తైవణుకుతూ "ముందో వాళ్ళదో చూసి పాకే ఏడవ్వే అమ్మాయోయ్, అనవసరంగా ఏడిస్తే

తరవాత మళ్ళీ ఏడవాలి" అంటూ కూతురుతో సలహా. అక్కణ్ణించి నేను "అప్పచ్ఛపు మాట లెందుకమ్మా! ఇరవై పెట్టెలు దిగాయికందా మావి. నీకు ఒక్కగాని ఒక్క పెట్టాయిరి (తలగడా అంత)? మమ్మల్ని చంపుగు తినడానికి కాకపోతే, నీ కొచ్చిన యేళ్ళకి, అదొక్కటీనువ్వ దాటపెట్టు గోవాలీ, చెప్పూ? గెల ఆ ముసిలిదే పట్టుగుంది కదా, నువ్వ చేస్తాన్న ఉద్యోగంవమిటి, వెధవఉద్యోగం నువ్వూను!" అల్లాగ ఇల్లాగ అంటూ నేను మండిపడ్డాను. ఏమనుగుతారుకథా! నేనేమో కారాలూ మిరియాలూనూ; ఆవిడా తల్లీహాలోలక్ష్మణా అని ఏమప్పులూ పెడబొబ్బలూనూ; పక్క టిక్కట్లతణికీవాడు సతాయింపూ! మా వాళ్ళు "ఊరుకోరా, అబ్బా! ఊరుకోవమ్మా!" అంటూ ఊహూ లబాయిలూ దిబాయిలూనూ! ప్లాట్‌ఫారంమీద అశేషజనం ఆశ్చర్యం వేసిపోయి నవ్వలకి పడ్డారు. అప్పుడు, మహా రసకందా యుప్పట్టులో ఉంది వ్యాపారం, అని చెబుతోచ్చారు, పై వాళ్లు!

ఇల్లా నడాడుతూంటే, ఆ కాకినాడ రైలుకాస్తా ఉడాయించేస్తుందేమో అని చెప్పేసి, మావాడు-నాతరవాతవాడు-వాడి దగ్గిర (ఏమాటకామాటే చెప్పుగోవాలి) బాగా కార్యపిర్వావాకత్వం ఉందీ!-టిక్కట్ల పంతుల్ని కాస్త అసింటా లాక్కెళ్ళి లోపాయికారీగా వాణ్ణి సంతోషపెడతానని వాడికి ఆశపెట్టి వాడిచేత ఇంతమందికీ (సరే, మతిమండి

నష్టే ఉంది! ముగ్గురికి ఆహారించాయిగా! కడంవాళ్ళకే) టిక్కెట్లు తెప్పించి, వాటి కేసో ముట్టచెప్పి, ఓరొందు కరుకురూపాయిలు స్టేషను మేష్టరు పాదాలదగ్గిర పారేసి, కరకమ్మని తీసికెళ్ళి ఆయనకి అప్పచెప్పి-రాజమండ్రీనించి తమతో కలిసి కాకినాడ ప్రయాణం చెయ్యదలచి కూడా వస్తూన్న ఆమనిషి తాలూకు కిస్మతయిన ఓ ట్రంకుపెట్టి వార్తి అజాగ్రత్తవల్ల చెయిదాటి వాత్తేరుకేసి కొట్టుకుపోయిందనీనీ, అది వెనక్కి తెప్పించిపెట్టి ఆవిడకి అందజేసి పుణ్యం కట్టుకో మనీనీ ఆయనతో అనేసి, బతుకుజీవుడా అని అక్కడ ఆవిణ్ణి వొదిలించేసుగుని, మేం అంతా ఈ లోపుగానే ఎక్కి నిరీక్షిస్తూన్న పెట్టిలోకి ఇహ రైలు కదుల్తోందీ అనే వేళకి వచ్చి పడ్డాడు. కరకమ్మతల్లి, వాళ్ళ బంధువు లెవరో కాకినాడ వాళ్లు కనబడితేనూ, అరిటిగెల ప్రాణపదంగా పుచ్చుగుని మూలుగుతూ వాళ్ళ పెట్టిలోనే కూర్చుంది. సరే, మేం కాకినాడ జేరుకున్నాం మొట్టుకి.

ఆసాయంత్రం రైల్లో వస్తానన్న మాస్నేహితుడు రాత్రిలగ్నం గనక కాస్త కద్దనగానే వచ్చి తరవాత వృత్తాంతం తను చెప్పాడు. అయిదింటికి ఆయన సామర్లకోట స్టేషనుప్లాట్‌ఫారంమీద స్నేహితుల్తో కలిసి మాటా పలుకూ ఆడుకుంటూంటే, గాభుప్రు కొట్టినట్టుముహం ఎండిపోయి కళ్లు బాగా ఇంత లోతుకి దించుకుపోయి కరకమ్మగారు చక్కా వచ్చి, ఆయెనతో (పొద్దున్న జరిగిన సంగతి సాయంత్రం

వచ్చే ఆయనకి కొట్టిన పిండైనట్టు) "దొరికిందండి పెట్టె, పట్టు గున్నారు, పాపం! ఏమీ పోలేదు. అరిటిగెల ఎక్కడుందో మీకు తెలుసా" అందిట. "పెట్టేమిటి, అరిటిగెలేమిటి", అన్నాట్ట ఆయన. అంతే "మాఅబ్బాయివచ్చాడుగా, మాతమ్ముడూ! మాతమ్ముడికి జీతం! వాడొచ్చి నా పెట్టి పెళ్లిగ్రాపులో తెప్పించాడు" అని మళ్ళీ అందిటావిడ. అప్పుడు "అయితే ఏమంటారు? పెట్టేమిటి? అరిటిగెలేమిటి? అబ్బాయేమిటి? ఇదంతా యేమిటి?" అని ఆయన తరిచి తరిచి అడిగిన మీదట గావును, ఆవిడ తనపెట్టె తప్పి పోవడం–ఏది?–సంగతీ, సందర్భం, దొరకడం, అరిటిగెల తమదే అనీ, వాళ్లమ్మ ఎక్కడేనా వొదిలేస్తే, పెళ్లివారు జాగ్రత్తచేసుగుని తలో అత్తం మడిగట్టుకుని నోట్లో వేసు కుంటారేమో అస తనకి భయమనీ, కూలివాడికి డబ్బులి చ్చేసి మేమే అది తమబసలో పడెయ్యవలసి ఉంటుం దనీ, ఏమిటేమిటో చదివిందట కాని, ఆ చవటగెల ఎవడి క్కావాలి? పైగా, ముసిల్ది ప్రాణమేనా వొదుల్తుందిగాని, గెలవొదిలిపెట్టి ఒక్కక్షణమేనా ఉండందే అసలు! సరి, గెల ముసిల్దే పట్టుకు పోయిందని మాస్నేహితుడితో చెప్పేశాం, అక్కణ్ణించి, "ఓరి మన కంగారు బంగారం గానూ" అనుకోడం మొదలెట్టాం.

పెళ్ళిపీడ దీంతో వొదిలింది మాకూ అన్నట్టు పెళ్ళి లక్షణంగానే జరిగింది. అంతా చివరంటా సవ్యంగానే ఉంది.

ఆఖరికి, మరోమాట! మేం కాలక్రమాన్ని రాజమండ్రీ వచ్చేసింతరవాత, ఇక్కడ తప్పాటికట్లుఇచ్చినాయన, పాపం, జ్ఞాపకం చేసుగుని మాకు డబ్బు ముదరా ఇచ్చేశాడు. బండీవాడు-పానీ, బండీఆయన-గొడుగు మాకు వాపసు చేసి తన బేడా పట్టుగెళ్ళాడు. కాని, "పెలిగ్రాం తాలూకు ఇచ్చిన రొండురూపాయలూ మట్టుకు కరకమ్మగారి దగ్గిర వసూలు చెయ్యలేక పోయానుగదా, తన్నాచెక్కా!" అని కొంతకాలం నేను అనుకోవలిసిన అవసరం వచ్చినా, పాపం, ఆవిడా ఇచ్చేసింది. అవాంతరాలూ, ఒడుదుడుకులూ మధ్య మధ్యే గాని, చివరకి, అప్పే, ఏం లేదండీ!

# విమానం

కొంతకాలం కిందట ఓ విమానం రాజమండ్రీ వచ్చి గోదావరిలో దిగింది. ఇటీవల ఓ జోడా విమానాలు వచ్చి గోదావరి తిప్పమీద వంతెనకి ఉత్తరంగా దయచేశాయి. వెనకటిది జలంనుంచి ఎగిరేదికాని, ఈ రెండూ భూమి మీంచి రాంబందుల్లాగ ఎగిరేరకం. అసలు విమానంలో దేవతలు బైటాయించవలిసిందిగాని, తీరాచూస్తే దొర్లే ఉన్నారు. వర్ణసామ్యంబట్టి దొర్లు దేవతలాగ మరి! ఆమాట కొస్తే, విమానం ఎవరెక్కినా వారు నెత్తిమీది వారే అవుతారు. ఆవచ్చినవారు వ్యాపారంమీద వచ్చిన వారవడంచేత, ముందు రాజమండ్రీలో దిగుదామా, బెజవాడలో దిగుదామా, విశాఖపట్నంలో దిగుదామా, అనంతపురంలో దిగుదామా ఖాళీవాదంలో దిగుదామాఅని గుణకారాలు ప్రారంభించుకోలేదుట. వేర్వేరుగుణకారాలకి ఏకఫలితం ఉండడం చాలా అరుదుఅనో, దీర్ఘాలోచనమీదట విమానం కంటె ముందు వ్యాపారమే ఎగిరిపోతుందనో గావును-ఏదో యేర్పాటు మీద వీలుచూసుగుని వారు రాజమండ్రీలో దిగేశారు. విమానం ఆకాశంలో వెడుతూన్నప్పుడు జనం చూస్తోచ్చినందుకు మాత్రం వీరు టిక్కెట్టుపెట్టలేదు. అదినేలమీద వాలి ఉన్నప్పుడు దాని దగ్గిరికి వెళ్ళి, దాన్ని పరకాయించడానికి ఓపావలాటిక్కట్టు, నిర్ణయించారు-సర్కస్‌జంతువుల్ని చూడడానికి వీలునుబట్టి ఓఅణా పెట్టినట్టు. ఇది గాక,

చిన్న ఎగురుకి పదిరూపాయలూ, పెద్ద ఎగురుకి పాతిక రూపాయలూ, ఇంకా కావలిస్తే దాకరూపాయిలని మైలుకి రెండున్నర రూపాయలూ — కేట్లతో వీరు చాలా మందిని ఎగరేసి, తిప్పితిప్పి నేలమీద దిగవిడిచారు. చిన్న ఎగురు అయిదారు నిమిషాలు; పెద్దది పది పదిహేను — టిక్కెట్టు రూపాయలు లెక్కచూసుకున్నంత సేపు లేదు. దిగింది లంక మీద గనక పడవలకీ స్టీమరుకీ కొంత తడి తగిలింది. జనం, తీర్థానికి ఇంతరద్దీగా వెళ్ళరు. వెనక ఓలంకమీదికి దిగంబర స్వాములవారు వేంచేసినప్పుడు స్త్రీ పురుషులు ఇంతకంటె భక్తితో వెళ్ళినా, ఇంత తప్పని సరిగా ముడుపు చెల్లించలేదు.

కొత్త పరిస్థితుల్లో ధనంకంటె సాహసమే ముందుకొచ్చి పడుతుంది. అందుకని చాలా డబ్బున్నవాళ్ళు, పొడుగుపాటి బేరాలుచేస్తూ ఆగిపోగా, సాహసులు — (వీరిలో కొందరు అణాబిళ్ళమాత్రులు) మొదట్లోనే ఎక్కి షికారు తిరుగుతొచ్చారు. స్త్రీలు కొద్దిమందిమాత్రమే ఎక్కవచ్చారట. ఒక ముసలమ్మ తన ప్రాణానికి తెగించి కర్రతోసహా ఎక్కిందట. ఆ "ట్రిప్పు" లోనే. ప్రమాదాలు వచ్చి ముసలమ్మలుపోరుగదా అనేధైర్యంకొద్దీ, ఇద్దరుధీరులు దెబ్బలాడి యెక్కారట. లంకమీదికి వెళ్ళలేనివాళ్ళు, విమానంఊరుమీద తిరిగేటప్పుడు బయలుదేరే హోరుకి ఇవతలకి వచ్చిపైకిచూసి సంతోషించేవారు. అనగా, విమానంపూ రేగ

వచ్చేసరికి జనానికి ఊర్ధ్వదృష్టీ, ఊర్ధ్వశ్వాసా బయలుదేరాయి. ఇది ఎన్నిసార్లుచూస్తే అంతఘనత అనుకుటారని గావుకు, "అబ్బో! నేనప్పుడే పదోమాటు ఇదిచూడడం!" అని కొందరు బడాయి కొడుతూండేవారు. పాలకొల్లుకేసి ఇది సబురు తిరిగేటప్పుడు ఇది ఒకగ్రామం మీంచి పోతుంటే, అక్కడతద్దినం జరుగుతోందిట; భోక్తలు భక్ష్యాలు విరుస్తున్నారట, కర్త పాణిణ కలుపుతున్నాడట, ఈవిమానవుహోరికి యజమాని వీధులోకి ఎగడి, పక్షివతుగా ఎగిరిపోతూన్న విమానాన్ని, చూసి, పితృదేవస్థానంలో కూర్చున్న గోపాలాన్ని రెక్కలంకించుకుని మొర్రో మొర్రో అంటూండగా చేతిలో గారెపళ్ళంగా ఆయన్ని నడివీధిలోకి ఈడుస్తూ, "ఇంకా చూస్తావేమిటి గోపాలం, ఎగిరిరాకా! తద్దినం మళ్ళీవచ్చేదే" అని కసురుగున్నాడట. ఇది అశాస్త్రీయం అంటే ఏంప్రమాదమో అని మంత్రం చెప్పేఆయన, "ఇక్కడికి మీనాన్నగారి ఆత్మకి విమానదర్శనం చేయించారు, ఏమి పితృభక్తి" అని మెచ్చుగున్నాడట. అల్లాగ్గా, అందరూకూడా ముందుదీన్ని చూసి, తరవాత మరోపని చేసుగునేవారు. ఇది ఒక అమ్మవారైపోయింది. దాని ధ్వనిలాంటిధ్వని ఏది వినబడ్డా సరే, జనం ఇవతలికివచ్చి చూడడం పరిపాటై పోయింది—రాజు రాజవీధిని ఏగుదెంచుతూంటే పురస్త్రీలు ఏ పనిలోఉన్నవాళ్లు ఆమట్టుగానేవచ్చి అతణ్ణి తొంగి చూశారని ప్రబంధకవులు దొర్లించినట్టు! ఇంట్లోంచి విమానంధ్వని విని కొం

దరు కొందరు తెమిలి వీధిలోకి వచ్చేటప్పటికి అప్పుడే అది తోకముడిచేది. ఇతర ఊళ్ళనించి కేవలం ఈ పనిమీద ఇక్కడికివచ్చి "వేరేపనుండి వచ్చాంలెండి" అని దబాయిస్తూండడం కొంతమంది. రెండుమూడురోజు లయ్యేసరికి ఊళ్ళో విమాన విశేషాలు విజృంభించాయి. "మనుష్యుల్ని అందులోకి ఎక్కించి గానుగెద్దుకి కట్టినట్టు కళ్ళకి గంతలు కడతార్ట, ఏమీ కనిపించకూట, అల్లాంటప్పుడు ఇహ ఈ రకం వారీగాళ్లు ఎక్కి ఏం లాభమో!" అని ఒకరు. "మనిషిని తోలుపటగాలెట్టి బిగదీసి రెక్కలు విరిసి విమానపు రెక్కలకి కట్టేస్తారట" అని ఒకరు. "పైకి వెళ్ళడం అంటే పైకి వెళ్ళడమే. ఎక్కడిమాట! ఈ ఎక్కే పీనుగులు విల్లురాసేసి మరీ ఎక్కడం మంచిది" అని కొందరు జాగ్రతపరులు. "ధనిష్ఠాపంచకాల చిక్కు లేకుండా కాస్త ఏకాదశి లాంటిది చూసుకుని ఎక్కడంవల్ల మోక్షంకూడాను" అని కొందరు భక్తిపరులు. "ఇది ఇందాకా మాయింటి మీంచే వెడతా-దానికింద చెక్కిన అక్షరాలుకూడా చదవడానికి వీలైంది. నేను ఇహ ఎక్కదల్చుకోలేదు" అని ఒక దర్జా పురుషుడు. "రేట్లు మరీ చురుకుగా ఉన్నాయి, నేను సగం రేట్లు అయింతరవాత గాని ఎక్కను" అని ఒక బేరగాడు. "ఇది దిగిన లంకమీద ఇన్స్యూరెన్సుకంపెనీ ఏజెంట్లుమకాం చేశారట వీళ్ళసందర్భాలు ఇదైపోనూ, ఓఘాయిత్యంకుడాను! నా ఎండకన్ను అదురుతోంది. నేను రాను బాబూ!" అని ఒక శకున్నప్రధాని. "మొన్న ఓ కోమట్లబ్బాయి విమానం

ఎక్కి అది కదలబోయే వేళకి భళ్ళునపోక్కున్నాట్ట, మృత్యు వంత పనిజరిగిందట. ఎందుకొచ్చింది'' అని ఒక ధైర్యశాలి. ''డోక్కోడంలో క్షేమల్లేనట'' అని ఒక వెకిలిఅబ్బన్న. ''అంచేతే ఆ అబ్బాయి దగ్గర మరి పది రూపాయలు వసూలు చేశారట.'' అని ఒక ప్రత్యక్షవాది. ''తుదనెగ్గి నేలమీద కాలెట్టిందాకా నమ్మకం లేదుట. ముందే డబ్బివ్వడం దండగేమో!'' అని ఒక గడసరి తనస్నేహితుడికి సలహా ఇవ్వగా, ఆస్నేహితుడు, ''అల్లాగనక జరిగితే తరవాతే ఇస్తానంటాను. ఎంజేస్తారేమిటి?'' అన్నాడట. రాజవీధిని పోతూన్న విమానాన్ని మెడనెప్పెట్టేవరకూ చూసి, ఒక బాటసారి తన పక్క నున్న పెద్దమనిషితో, ''ఏమండీ అయ్యా! పైకి వెళ్ళేసరికి గాలి మారడంవల్ల ఎవడికో మూగాడికి మాటలు వచ్చాయంటున్నారు. ఏమిటి ఊహ?'' అన్నాడు. అంటే ఆ పెద్దమనిషి, ''ఏం! మీయింటో ఎవరికేనా మూగా?'' అన్నాడు. అందుకు బాటసారి, ''మరేనండి. మాయింట్లో దానికే'' అని జవాబు ఇచ్చాడు. ఆపైని, పెద్దమనిషి, అదృ వంతులే. ఇహను ఆదుర్దా ఎందుకూ?'' అన్నాడు. బాటసారి, ''నయంఅవుతుందంటారా?'' అనిఅడిగాడు. పెద్దమనిషి, ''ఏమోగాని, క్షణిక సౌఖ్యానికి పాతిగేసి వదలడంవల్ల దిగిన తక్షణంమీకుకూడామాటపోతుంది.''అన్నాడు ఈలాగ్గాచిత్తానుసారం వృత్తాంతాలు చెలరేగి పాకడం ప్రారంభించాయి.

తరుణం వచ్చినప్పుడు ఉపన్యాసకుడు అమాంతంగా మొలుస్తాడు. ఎల్లానో సందు చేసుగుని ఒక సందర్భంలో వెన

కయ్య అనే ఒకాయన విమానాన్ని గురించి లెక్చరు పేల్చాడు! "ఇప్పుడంటే ఎవరో ఆ వేళపు ఘటాలు 'ఈరిపేన్, ఈరిపేన్' అంటూ ఎగబడుతున్నారు గాని, మన స్వంతానివి లేవుటండీ బోలెడు విమానాలూ? పురాణాలలో లక్ష ఉన్నాయి. ఆదిని, విశ్వకర్మకిచాలా తీరుబడిగా ఉన్నప్పుడు అతనిచేత కర్త లేని ఒక విమానరాజం బ్రహ్మ చెయించాడు. ఆ సంగతి కుబేరుడి చెవిని పడేసరికి అతడు బ్రహ్మగారింటికి వెళ్లి అభోజనం పడుకుని అతని దగ్గిర్నించి అది కాస్తా బెల్లించుకు చక్కాపోయాడట. ఈమాట రావణబ్రహ్మ విని కుబేరుణ్ణి పక్కలు విరగదన్ని అది తనింటికి పట్టుకుపోయాడట. లంకలో ఆంజినీలవారు చూసింది అదేట. ఆ రావణాసురుడి తలకాయ లొంగక చివరకి వాడి హృదయం చీల్చినతరువాత, రాములువారు, సీతామ్మవారితో కలిసి దానిమీదే అయోధ్య వెళ్ళారట. మళ్ళీ కావలిస్తే కార్డు వ్రాస్తాంపో' అని రాముడు అక్కమీదట చోదకుడు లేకుండానే అది అలకాపురం నిష్క్రమించిందంట. అదీగాక, సకల లోకాలలోనూ ఉంటూండే జట్టీలు తెలుసుకు రావడానికి నారదులవారికి బ్రహ్మగారు ఓ విమానపు లైసెన్సు మొదణ్ణించీ పారేశారట-(కొడుకు గనక మామూలు లంచం లాగకుండానే ఇచ్చారట ఆ లైసెన్సు మాత్రం) ఇంద్రజిత్తులవారు మాయ చేశారంటారు గాని విమానంమీంచేట యుద్ధం గావించింది. పూర్వం ఒక హిందూ రాజుతో ఒక యవనుడు పేచీపడి, తరవాత

మెత్తనిమాటలు చెప్పి ఆ రాజుని విమానపు షికారు చేయిస్తానని పైకి కొట్టుకెళ్ళి, విమానం మాంచి వేగంలో ఉన్నప్పుడు రాజుని బెడ్డముక్క గిరవటేసినట్టు కిందికి గిరవటేశాడట. వెనక మరొక రాజు పెళ్ళానికి పురుడురోజులట, ఆవిడ అక్కడికి చాలా దూరాన్ని ఉన్న ఒకచోటికి వెడితేగాని నీళ్ళాడనని కూచుందిట, ఆమట్టున అతి వేగంగా వెళ్ళే వాయువిమానం కట్టి ఆవిణ్ణి ఆప్రకారం చిటికెలో తీసుకు వెళ్ళవలసిందిగా ఆ రాజు తన ఆస్థాన శిల్పుల్ని ఆజ్ఞాపించాడట! భోజుడు వర్ణించినదాల్లో కూడా ఏజంతువు ఆకారంలోనైనా సరే విమానం నిర్మించవచ్చుననిన్నీ, ఇనుపగుళికలో పాదరసం ఎక్కించి దాన్ని వేడిచేస్తే యంత్రం పైకివెళ్ళి, వేడితగ్గిస్తే కిందికి చేరుతుందనిన్నీ ఉంది వెనకట్లో మనవాళ్ళు! సామాన్యం అని చూస్తున్నారాఏమిటి? హేం."

ఇల్లా, చాలామంది వెనకచూపుచూసి హిందువుల పూర్వ ప్రతిష్ఠ చెబుతూ ఉండగా, కొన్నికొన్ని చోట్ల, విమానం ఎక్కివచ్చినవాళ్ళకీ ఎక్కనివాళ్ళకీ సంభాషణలు జరుగుతోచ్చాయి. విమానం ఎక్కినవాళ్ళల్లో ఎవడైనా ఇతర గ్రామం పనుండి వెళ్ళినప్పుడు ఆతగాసిని ఓ పెద్ద కథానాయకుడుగా కట్టి జనం విరగబడి చూడరావడం జరుగుతోచ్చింది—అతను అదెక్కిన తరవాత అతనిముఖంలో ఏమన్నా మార్పు ఉందేమో అన్నట్టు. ఒక్కొక్కప్పుడు ఒక్కొక్కణ్ణి ఇల్లా చూస్తూంటారు లెండి. ఇదివరదాకా మోటారుదై

వర్ని చక్రధరుణ్ణి చూసినట్లు చూడలేదూ ఇప్పుడంటే ఇల్లా అయిపోయిందిగానీ, ఇదివరదాకా బి. యే. లని సరస్వతీ విగ్రహాలని పొగడలేదూ? అల్లానే ఇదీగావును. విమానం ఎక్కినవాడు కొండయ్యే అయిపోతే, ఎక్కనివాడు నేలయ్యే గానే ఉంటాడు. అల్లాంటివారికి ఈదిగువ ప్రసంగంలాంటివి నిరంతరంగా జరుగుతోచ్చాయి :—

నేలయ్య—తమరు మహా ఎగురుతున్నారుట మన ఊరుమీద, నిజమేనా?

కొండయ్య—ఎవడా అన్నది?

నే—అదిగాదయ్యా, విమానంలో కొండెక్కారట! విశేషాలు?

కొం—మీకూ తెలిసిందీ, అప్పుడేను?

నే—తెలియకేం జేస్తుంది! ఆకాశసంభవాలు రహస్యంగా జరగవ్.

కొం—అల్లాగేమరి! నేనూ విమానం ఎక్కి దర్శించాను, పదిరాళ్ళు! అక్కడితోగాని తీరలేదు బులబాటం.

నే—ఎల్లా ఉంది?

కొం—బాగానే ఉంది!

నే—అంటే?

కొం—ఏం జెప్పనూ? ఆకాశంలో వెడుతూన్నట్టుంది!

నే—ఏడిసినట్టేఉంది. అదికాదు, నీకు భయం వెయ్యలేద్దూ?

కొం—దానికేమిటి? అది, మనిషినిబట్టి ఉంటుంది.

నే—అధమం, కళ్ళైనా తిరగ లేదూ!

కొం—అదీ అంతే! కొందరికి అరుగెక్కి కిందికిచూస్తేనే కళ్లు పచ్చులుగమ్మి చెవులు గడియలడతాయట. ఎక్కడికి!

నే—కుదుపు ఏమాత్రం ఉంది?

కొం—కుదుపుకి మోటరుబస్సు ఫస్టూ! విమానానికి ఆమాత్రం ఎక్కడేడిసింది? విమానప్రయాణం పడవప్రయాణం కంటె మెత్తన.

నే—అయితే, ఇది నేల ఏరీతిగా వదుల్తుంది?

కొం—మోటారులాగే నేలమీద ఓ అరమైలుపాకి ఆ వేగంలో నేల వదిలిపెట్టేసి లేచిపోతుంది.

నే—అంతేగాని గాలిలోనికి అట్టగమ్మే మని నిటాగ్గాంఉన్నచోట్నించి ఎగరలేదూ? ఇంతాచేసి వొట్టిదే?

కొం—నీ దయవల్ల విమానకర్తలు ఇంకా అంత మట్టుకి రాలేదు.

నే—సరేగాని, పైనించి వెదుతూంటే నేను కనబడ్డానూ?

కొం—ఆ. సరీగ్గా నువ్వులానే కనపడ్డావు. అంతా కుడా అల్లాగే ఉన్నారు. జంతువులు నువ్వులానే ఉన్నాయి. ఇది వరకు నేను ఎరుగున్న బ్రాహ్మలూ అబ్రాహ్మలూ, హిందువులూ మహమ్మదీయులూ, పునిస్త్రీలూ వెధవముండలూ—వీళ్ళవయినం తేలకుండా కనిపించింది. పైకివెళ్ళి కిం

దికి చూసేటప్పటికి భూమిమీద మానవులు పెట్టుగునే తేడాలు నా చర్మ చక్షువులకే అంతరించాయి. విమానం కేసి చూస్తూన్నప్పుడు మానవుడి అఖండత్వం, కిందికి చూస్తూన్నప్పుడు మానవుడి అల్పత్వం కనిపించాయి. నేను చేతి కుమాలు ఊగించాను నువ్వు చూశావూ?

నే—లేదుగాని, లోపల గాలి ఉంటుందా?

కొం—చెమటగా ఉంటుంది! కాని, పక్కల్ని ఉండే అద్దాలు ఒత్తిగించి వేలు బయటికి పెడితే గాలి యొక్క జోరుకి వేలు తెగిపోతుందా అనిపిస్తుంది.

నే—సరేకాని, విమానం ఎక్కడేనా మళుపు తిరిగేటప్పుడు రామస్మరణ మంచిదంటారు, నిజమే?

కొం—కొంచెం ఒరుగుతుంది కాదూమరీ, అందుచేత అల్లా అంటారు. కానీ, ప్రతీయంత్రంకూడా మళుపులో అంతే. ఈయంత్రం గురించి జనంయొక్క ప్రత్యేక భయం ఏమిటంటే, ప్రమాదానంతరం శరీరమే కనపడదేమో ఆసుపత్రికి ఈడవడం దేన్నీ అని.

నే—పోనీ మనవూళ్ళో పెద్దభవనం ఎల్లా ఉంది?

కొం—లక్కపిడతలా ఉంది.

నే—పెద్దబరి ఏరీతిగా ఉండుకుంది?

కొం—పొయ్యిలాగ ఉంది.

నే—గోదావరి వంతెన?

కొం—భీముడి చేతులో ఉండే ధప్పళపు గరిటె కాడలా ఊరుకుందో

నే—లోపల జనం మాట్లాడుకో వచ్చా?

కొం—ఆ, చెవులో, ఊళ్లోవాళ్ళకే అంతధ్వని వినిపిస్తే అందులో వాళ్ళకి నిశ్శబ్దంగా ఉంటుందా? అందుకనే, దమయంతీ స్వయంవరానికి ఇంద్రాదులు బంగారు విమానాల మీద భూమికి వాలేటప్పుడు మేఘగర్జనలాంటి ధ్వని అయిందిట.

నే—అల్లాయితే, విమానంలో పోతూన్న రంభాన లకూబరులమాటలు కిందున్న కలభాషిణికి వినిపించాయి అని సూరన్న రాశాడే? కోశాడన్నమాట!

కొం—పూర్తిగా కొయ్యలేదు. అందుకు గురుకారణం ఒకటి నేర్పుగా తగిలించి సర్దుకున్నాడు. సూరన్న మీదికి ఆట్టే వెళ్ళకు. అతడు, ఊహించో, గ్రంథాల్లోచూసో, పెద్దలవల్ల వినో రాసిన దూరదృష్టి దూరశ్రవణాలు సిద్ధించలేదూ నేడూ! భోజుడు చెప్పిన విమానాలమాట అతగానికి మనస్సులో ఉండి అల్లా రాశాడేమో! వాటికి హోరు లేదేమో!

నే—సరే, వీటికేంగాని, నువ్వు ఎక్కిచూసొచ్చావు గదా, భూమి గుండ్రంగా ఉండడంగురించి నువ్వేమి "సెటల్" పరుచున్నావు?

కొం—ఏమో! ఈమాటు పూర్ణంగా చూడాలి.

నే—పోనీ, సూర్యుడు ఏసైజులో కనిపించాడు.

కొం—నాకుకూడా పనిలేదనుకున్నావా ఏమిటి?

నే—(వాడు వెళ్ళిపోతూండగా) ఒస్! ఎల్లాగైతేం; మహా! ఇదంతా నాకూ తెలుసు. "ఘనశైలంబులు బొమ్మ"

ఈలాంటి ప్రశ్నోత్తరాలకి అంతలేదు. కిల్లీ దాసుగారైన మా స్నేహితుడొకడు తను విమానంలో తిరుగుతూన్న సమయంలో కృష్ణుడువచ్చే నాటకం ఏదీకూడా కింద జరుగుతూ ఉండదని తనకి తెలిసి ఉండడంవల్ల లాభంలేదని ఊరుకున్నాడటగాని, లేకపోతే గయుడుతో చెప్పేసి ఓనిష్ఠీవనం వేసేసి ఉండేవాడట. "ఇక కొన్ని ఏళ్ళల్లో జనం యావన్మందీకూడా ఎగిరిపోవడం రూఢి. ఈరోజున నే అన్నాను చూడండి!" అని ఒక జ్యోతిష్కుడు సిద్ధాంతం చేశాడు. "విమానం వచ్చిం తరవాత ఇక మోటారుకారు కుక్కముట్టుగుపోయిందన్నమాటే అని ఒక కారుప్రియుడు దుఃఖించాడు. "ఈ విమానం తాలూకుకూడా కొన్ని ఆంగ్లపదాల్లు తెలుగులో జొరపడి తెలుగు ఇంకా పాడవుతుందిగదా!" అని భాషాశ్రోత్రియుడు ఒకాయన ఆచమనం చేశాడు. "సృష్టించిన ప్రామిసరీ నోటు కేసుల్లో ప్లీడరు సాక్షిని, 'ఆవేళ నువ్వు మీ ఊళ్ళో ఉన్నానంటున్నావుగదా, ఆవేళే అంత దూరాన్ని ఉన్న ఊళ్ళో సంతకం ఎల్లా చేశావు?' అని అడగలేడు ఇకమీదట" అన్నాడు ఒక కోర్టుగబ్బిలం.

చలనం జీవసూచకం. గమనం ఇంకా ఎక్కువ జీవానికి తార్కాణం. గమనవేగం మరీఎక్కుడు జీవానికి లక్షణం.

గమనవేగాంతరం అతీతమైన శక్తికి చిహ్నం. జంతువులలో వేగం లేడిది, పక్షులలో మహావేగం వానకోయిలది. అది గంటకి 200 మైళ్లు. మోటారుకారు కారుయొక్క మహత్తర వేగం, ఇంతవరకు, గంటకి 207 మైళ్లు. వాయువేగం గంటకి 250 మైళ్లు (సుమారు), విమానంయొక్క మహత్తమ వేగం గంటకి 318 మైళ్లు. కాలంయొక్క ప్రాధాన్యమును గణించడం నాగరికతకు తెలుసును కాబట్టి అది ఎప్పుడూ వేగమే కోరుతుంది. బలం దేశాన్ని జయించగలదే కాని, వేగం దేశకాలాల్ని జయిస్తుంది. వేగసిద్ధికి యంత్రమే దిక్కు. వెనకటి మాటలటుంచి ఇప్పుడు యంత్రం హైందవేతరుల సొమ్ము. అందువల్ల, ఇతరులు గమనవేగంకోసం నిరంతరయత్నం చేసి, విశేషధనం వెచ్చించి, నూతన యంత్రాలు నిర్మించి, తంటాలు పడుతూన్నమాట నిజం. ఆయంత్రాలలో ఈ విమానం ఒకటి. ఇప్పుడు ఇతర దేశాల్లో విమానాలమీద పడకలు, భోజనాలు, అల్పాహార విందులు, పురుళ్ళు, టెన్నిసు ఆటలు యుద్ధాలు, జననష్టంకూడా అవుతూన్న విలాసయుద్ధాలు— ఇల్లాగ్గా సమస్తమూ జరిగిపోతున్నాయి. ప్రస్తుతకాల హైందవులు మాటలు చెప్పుగుని గాలి మేడలు కడుతూంటే, నేటి ఇతర దేశీయులు గాలిఓడలు కట్టుగుని మూడేసి వందలమంది ఒకేసారిగా ప్రయాణాలు వెడుతున్నారు. కాని, మనం ఇల్లా అనుకోవచ్చులెండి, "వాళ్ళ దేశం ఇరుకు గనక వాళ్ళు దేవుడా అని పైకి లేచిపోతున్నారు. మన దేశం విశాలంగనక

–(కొందరు అనుకుంటున్నారు) మనం కాళ్ళు పారజాచుకుని కూర్చోవచ్చు!'' అని. ఏమైతేం, ఇంకా ఎక్కువ వేగం సంపాదించాలని ఇతరులు శ్రమపడుతున్నారు. గంటకి వెయ్యి మైళ్ళ పైచిలుకు వేగం సిద్ధించితే భూప్రదక్షిణం ఒక్క రోజులో చెయ్యడం వీలుపడునుగదా అని కొందరు చూస్తున్నారు. ఇందులో ఖర్చు పడేటటువంటి "పెట్రోలు" విసర్జించి ప్రమాదాలుకూడా లేకుండా అయస్కాంతంతో పని జరిగేటట్టు కల్పనలు కొందరు చేస్తున్నారు. రాత్రికాలంలో విమానప్రయాణం వీలుగా ఉండేటందుకు కొన్ని మైళ్ళ కాంతిస్తంభాన్ని నిటాగుగా ప్రసరింపచేసేటట్టివాయువుని ఒకాయన కనిపెట్టాడు. కొందరు ఉత్తరదక్షిణధ్రువాలదగ్గిరికి విమానాల మీద వెళ్ళాలని చూస్తున్నారు. "అక్కడేముందీ, బావుకోడానికి! వీళ్ళ మొహం! ఇంటోకూచోకూడదూ, ఏదో ఇంత తినీ!'' అని ఒక ముసలాయన కొట్టొచ్చాడు ఈసంగతి ఆయనతో చెప్పేసరికి. చాలమంది ఎవరెష్టు శిఖరం లాంటివి ఎక్కాలని చూస్తున్నారు. "వీళ్ళు తీరాచచ్చి చెడి ఎక్కేసరికి అక్కడ ఏ అయ్యర్ కాఫీ హోటలో ఉంటుంది. ఎందుకు వీళ్ళకీశ్రమ?'' అని కొందరు చప్పరించేశారు, మరికొందరు భూమి వదిలి పైకి ఎంతదాకా వెళ్ళగలమూ అని చూస్తున్నారు. ఒకాయన నాలుగుమైళ్ళ ఎత్తుకి వెళ్ళేసరికి, అక్కడగాలి పీల్చుకునేటందుకు చాలక, ఆయనకి ఉక్కిరి బిక్కిరి అయిందిటగాని విమానం మాత్రం ఇంకా ఎగబాకుతూనే ఉందిట. ప్రాణవా

యువు సప్లైచేసేయంత్రం చేత్తో పట్టుగుని మళ్లీ ఎక్కక మానను గా అనుకుని ఆయన దిగి పోయాడట. వాయువు లేని చోటకూడా విమానం వెళ్ళగలిగినా, లేక గాలిలేని చోట వెళ్ళగల యంత్రం మరోటి ఏదేనా బయలుదేరినా ఎప్పుడో ఒకప్పుడు మానవుడు ఇతరగ్రహాల్ని ఓ దెబ్బ తీస్తాడు. అది ఆక్రమించుగోడానికి ఐరోపీయులంతా కొట్లాడుకుంటారు. ఆ దెబ్బతోటి, నరుడికి గ్రహచారం వదలిపోయి, గ్రహాలకి నరచారం పట్టుగుంటుంది. విమానోదయంతోటి మానవులకి కొండకీ భూమికీ కాళం అన్నంత ఆస్తికలిసి వట్టుంది.

ఇవి చుట్టుపక్కల సంగతులు. మన దేశంలో విమానపు లైసెన్సులు ఇంకా ఇస్తారో ఇవ్వరోట. హిందువులు ఇంకా కొంతకాలం రోకలిబండల్లాగ నేలబారుగానే బతకవలసిన వాళ్లైతే వీళ్ళకి విమానపు లైసెన్సులు ఇప్పట్లో దొరకవు. అందుకని, టిక్కట్టు కొనుక్కుని దొర్లు తెచ్చిన అద్దె విమానం ఎక్కడమో, లేక, విమానం ఎగురుతూన్నప్పుడల్లాపోయి చూస్తూ, మాటలలోమాత్రం- మాకూ ఉండేవిట. మా పదోవర్గ ముత్తాతకి ఇంచక్కని విమానం ఉండేదిట. అందులో ఆయన షికారు వెళ్ళేవాట్ట. నేను మా విమానాలు ఎరక్కం! బోలెడు చూశాను మా పుస్తకాల్లో'' అని చెప్పుగుంటూ మురియడమో వీరికిపట్టిన అదృష్టంలా కనిపిస్తోంది, ఇన్నాళ్ళకి.

# పల్లెటూరి స్కూలు తణిఖీ తంతు

వెంకటాయిగారు గడ్డిపాలెంలో ఉదర నిమిత్తం బడి పంతులుగా కుదురుకున్న సాధారణుడు. ఆయన బహు సౌమ్యుడు. ఆయనికి స్థిరాస్తి భార్య, చరాస్తి తనే. అతగానికి నమ్మకంగా వచ్చే సాలాదాయం ఏమీ అంటే ఒక ఆడ శిశువు; కొండొకచో కవలలు. పై ఖర్చుకి నాలుగు రాళ్ళు కాక, పంటలరోజుల్లో ఊరివాళ్లు వసూలుచేసి అతడికి ముట్టచెప్పే ఇరవై బస్తాల ధాన్యమూ అతని సంసారానికి కొంతకూడు. పంటలు అటూ ఇటూ అయినప్పుడల్లా ఈ ధాన్యం గురించి, జనం, లోపల కొంచెం తిట్టుగున్నా ఇస్తూనే ఉండేవారు. ఇది గాక, ఇతరత్రా ఓ అక్షరాభ్యాసం అనో, ఓ దసరా అనో పేరెట్టి అతడు ప్రజల దగ్గిర్నించి ఓ జామారో గట్రో గుంజుకుంటూండే వాడు. పైగా, ఓ దస్తావేజు గోకిపెట్టో, ఓ సంబంధం ముడెట్టించో ఓ సాక్ష్యానికి తగులడో, ఓ బ్రాహ్మణార్థానికి పడిశో దిష్ఠి కొట్టకుండా ఇంతో అంతో కతుకుతూండే వాడు. ఇంకా, స్కూలు తణిఖీదార్లలో ఎవడేనా ఒక్కొక్క తరిపి ఘటం వచ్చినప్పుడు అతగాణ్ణి మనుగుడుపుకి మేపినట్టు మేపి అతని సిఫార్సులవల్ల గ్రాంటుకొడుతూండేవాడు. క్రితం ఏడు మాత్రం, పై అధికారి, గ్రాంటు సరిగా పారెయించలేదుట—ఏదో ఒకానొక సప్లయి తృప్తికరంగా జరక్క! ఇన్నిన్ని వీళ్ళూ ఉండడంవల్ల అతనికి మరోహా లోటు ఏమీ

రాకుండా నిమ్మకి నీరోసినట్టు జరిగిపోవలిసిందే కాని, ఒక్క అసిఘాత వచ్చిపడింది. ఆపాలెం మొత్తానికి అతనిదే ధర్మ లోగిలి. అందువల్ల ప్రతీ ప్రయాణీకుడూకూడా వీళ్ళింటో ఆగడం సాగించాడు. పొద్దెక్కితే పొద్దెక్కిందనీ, ఎండైతే ఎండనీ, వానైతేవాననీ, మబ్బైతే మబ్బనీ, ఏదైతే అదనీ కారణంగా చెప్పి, తన్ని మెడేసుగుని బలవంతపెట్టగా అవతల తన పన్లన్నీ నిప్పడిపోయినా సరే ఇక బాగుండదని తప్పనిసరివల్ల ఆగిపోతూన్నట్టు నటించి వాళ్ళింటో ఆగని బంధువుడూ, తిష్ఠవెయ్యని పరిచయుడూ, బసచెయ్యని బంధుపరిచయుడూ, చెయికడగని పరిచయబంధువుడూ లేడు. అల్లాంటప్పుడు ఖర్చు ఒకఎత్తూ, చాకిరీ దానిపై యెత్తుగా మరీ! పిల్లల చాకిరీతో గాక ఈపెద్దల చాకిరీతో కూడా ఇంటావిడ తంటాలు పడేది. పోవడం రూఢైతేగాని, రావడానికి మార్గాలు ఏర్పడవు. వెంకటాయిగారు సంసారవిషయంలో వీల్లేక, చదువు చెప్పడం విషయంలో మాత్రం కుమ్మరి పురుగులా ఉంటూ అర్జనకి ఇంకా అన్యమార్గాలు అన్వేషిస్తూండేవాడు. పక్కఊళ్ళో ఎక్కడేనా (అనగా, గడ్డిపాలెం చుట్టూ ఊరగాయి కుండలున్నట్టు అనేక గ్రామాదులున్నాయి) ఎవరేనా కుండ తడుపుకుంటే సరి, అక్కడల్లా ఇతడు హాజరు—కబురు ఏకాకి చెప్పేదో కాని! ఏదేనా తూతూబాకాగాని, రాండోలుగాని వినిపించితే అదే కన్యాప్రదాతగారి సవినయాహ్వానం, వేరేపిలుపెందుకు! అని వెంకటాయిగారి మతం.

ఒకసారి వెంకటాయిగారి పెళ్ళాం పురుడోసుగోడానికి పుట్టింటికెళ్ళింది—ఏ పేటా ఇదో చిక్కుగా! తొల్చూరుకొడుకు ఒక్కడూ మాత్రం తండ్రితో ఉండిపోయాడు (చదువు చెడిపోతుందని). ఆ తరవాత వాళ్ళు అంతాకూడా ఆడపిల్లలే అవడంవల్ల వాళ్ళు అయిదారుగురూ తల్లితోనే వెళ్ళిపోయారు. దాంతోటి ఇంట్లో గంజికాచిపోసేవాళ్లు కరువయారు. కాని జనం రావడం మానలేదు. కొన్నాళ్లు వెంకటాయిగారే చెయికాల్చుకున్నాడు. అయితే తన పెట్టుతోటి తనూ కుర్రపాడగట్టూకూడా దిగవారుకు రావడంవల్ల తన పిన్నత్తగార్ని పదిరోజులపాటు పంపిపెట్టవలసిందని ఆవిడ కొడుక్కి వెంకటాయిగారు రాయగా, రామేశ్వరతీర్థం గంగని కలపడానికి ఆవిడ కాశీ వెంచేసిందని అతను అప్పట్లో జబాబురాసి మరి మాసంనాటికి ఆవిణ్ణి పంపించాడు. ఆవిడ వచ్చిం తరువాత కొంపలో హద్దులేని సొదమాత్రం ముదిగింది. వెనకటికిమల్లే ఎవడేనా పిల్లింటో బైటాయిద్దామనుకుని గడపలో పాదంపెట్టేసరికి ఆవిడ వెంకటాయిగారి మీద ఓ టాప్పడవ బూతులు దిమ్మరించేది, లేకపోతే కుర్రాణ్ణి మాటనిపిల్చి రుంజావాయించినట్టు బాదేది. ఆపళంగా వచ్చినవాడు తారెత్తి నిష్క్రమిస్తూండేవాడు. కాని, మరో గ్రహచారం! ఎవరు మాట్లాడుతున్నా సరే ఆవిడ వినిపించుకోదు. పైగా, ఆవిడ వచ్చిన రాత్రే ఊళ్ళో ఒక పెళ్ళి ఊరేగింపుకి అవుట్లతో బాణాసంచా కాలుస్తూంటే, "ఇదేమిటి? ఇంత

పొగ ఎక్కడిదో!" అని ఆవిడ ముక్కుమీద వేలేసుకోడాన్ని బట్టి, ఆవిడికిఏమాత్రమో కొన్ని వీసాలు చెముకుకడా ఉన్నట్టు వెంకటాయిగారు గ్రహించాడు. గ్రహించి, ఆవిడఎవర్నేనా పట్టుకు దులిపేటప్పుడు తనే నోరు నొక్కుకుని, ఊరుకోమని, ఆవిడికి సంజ్ఞ చేసేవాడు. సంజ్ఞలు చేస్తే చెవిటివాళ్ళు కంట్లో పడతారు. అందుకని అల్లాటప్పుడు ఆవిడ గట్టిగా, "నాకేం? నీ నోరే నొక్కుస్తా! ఎలాగైతేం, చేశావు జోడీ ఉద్యోగం, మా అమ్మాయికి ఒక్క నగేనా పెట్టలేక పోయావు!" అని అరిచేది. "కొంపలో ఇదో తంపి కూడా వచ్చిపడిందే మిత్రా ప్రభో" అనుకొంటూ వెంకటాయిగారు స్వహస్త పాకం చేసుగునే నాటి కంటేకూడా చిక్కి సహాయయాడు.

మరికొద్దిరోజుల్లో పక్కఊరైన నందిపిల్లిలో వివాహం అయింది. కర్నంజాలక వీరికి పిలుపుకూడా వచ్చింది. నడిచే త్రాణలేక వెంకటాయిగారు "పోనిస్తూ దాం తగలేశిన భోయినం" అని చాలాభాగం విరక్తి తెచ్చుగుని మానేసెయ్యాలని అనుకున్నాడుగాని ఆవిడ "వెడితేవెళ్లు, లేకపోతే మాను. వెడితే నాకేమీ పుష్టిలేదు, లేకపోతేనాకేమీ నష్టిలేదు. చచ్చినాసరే నేను ఈవాళ బియ్యమూపొయ్యాను పప్పూవెయ్యను" అని కేకెట్టింది. పాపం వెంకటాయిగారు ఎనిమిదింటికే స్కూలుకట్టేసి (ఇనసపెక్టరు కొత్తవాడో చ్చాట్ట, వాడెల్లాంటి వాడో గదా అని మనస్సులో కొంత ఫికరగా ఉన్నా) కొడుకుని వెంటేసుగుని నందిపిల్లికి అడ్డంపడ్డాడు.

ఆ వేళే రెండుజాములు తిరిగింతరవాత ఇద్దరు మనుష్యులు గడ్డిపాకలో ప్రవేశించారు. ఒకడు, కొన్ని కాగితాలూ గొడుగూ చంకని బెట్టుకుని బంట్రోతుకి మల్లేతొందరగా ముందు నడుస్తూంటే. రెండోవాడు బుట్టతలపాగా చుట్టి, పిల్లినడక అభినయించి, తల టెక్కించి, అంగలువేస్తూ వెంబడించాడు. ఆయన నడక యొక్క మాంద్యానికి ఒక కారణం దగ్జా అయిఉంటుంది కాని, అంతకంటె బలువయిన కారణం బొజ్జ. ఈచివర లక్షణంతోటి ఆయన సరిగ్గామూడు మూర్తులా స్కూళ్ళతణిఖీదారులాగ ఉరుకున్నాడు. ఊళ్లో చాల మంది హడిలిపోయి పగటిమతా బాలు కాలుస్తూవీధులో నిలబడి ఉండగా, వాళ్ళని దర్యాప్తు చెయ్యడంలో మేష్టరు గారు గ్రామాంతరం వెళ్ళడం గ్రహించి, వాళ్లు తిన్నగా స్కూలుభవనం దగ్గిరికి దారెట్టి, దాని సింహద్వారంతలుపు ఉతగయొత్తి పారేసి లోపలప్రవేశించిన మీదట బంట్రోతు మాత్రం ఇవతలికివచ్చి మేష్టరుగారిఇల్లు అడిగి కనుక్కొని ఆయనా పిల్లాడూ నందిపిల్లిభోజనానికి వెళ్ళడప్రసంగతి ఆ చెమిటమ్మగారి దగ్గిర్నుంచి కొన్ని పావుగంటలలో కమ్మెచ్చు లాగి పుచ్చుగుని, ఒకకూలి వాడి చేత ఆ ఊరుకబురు పంపించి, తను మళ్ళీ స్కూలు భవనంలోకి వెళ్ళి పోయాడు. ఊళ్ళో పెద్దలుకొందరు చొరవచేసి లోపలికెళ్ళి ఆ అధికారితో అనవసరపు సంభాషణచేస్తూ కూచున్నారు.

మనిషివాడు చావంతపని జరిగి నందిపిల్లిలోపడి పందిరి వేసి ఉన్న ఒక ఇంటిదగ్గిర ఆగే సరికి అప్పుడప్పుడే బ్రా

హ్మాలు ఇవతలికివచ్చి త్రేణుస్తూ చేతులు కడుక్కోడంలో, మేష్టరుగారు కూడా తనచేతికి ఏమాత్రమో జిడ్డుపట్టుకోగా తన బిరుసుగడ్డం వరహాకట్టలా ఉండడంవల్ల వేళ్ళగడ్డాన్నెట్టి పాముతూ పక్కాయనతో, "పరాయిఇంటో విస్తరి వేసేటప్పటికి ఎంత మొర్రో అంటూన్నా నెయ్యి కాస్త ఎక్కువగా పడితీరుతుందిస్మండి. జిడ్డు వదలటంలేదు!" అంటూ ప్రసంగంలో ఉండగా మనిషి వాడు ఆయన్ని సమీపించి, "వదల్తుందండి. ఇనప మేష్టారు వచ్చారండి. తమర్ని వెంటనే దయసెయ్యమన్నారు" అన్నాడు. "ఓరి నీ యినుం కాల్చా! వచ్చింది మాసిగంగారా, కాళ్లుకడగడంగారా? ఈ మధ్య మాసిగంగారు మారి కొత్తవాడు కూడా వచ్చాడన్నారు! అతనొక్కడేనా వచ్చింది? పెళ్ళాంపిల్లలూ కూడా రాలేదుకద, నాలుగెడ్లబండీ చేసుగుని? అతడేమీ ఖాళీబస్తాలూ, ఖాళీడబ్బాలూ వేసుగురాలేదుకద?" అని మేష్టరు కనుక్కున్నాడు. వాడు సమాధానం చెప్పకుండానే ఇందాకటి పక్కాయన, "అయ్యా, మాసిగం, కాళ్ళకడగడం అంటున్నారేమిటి? తెగతిని పెళ్ళిపందిట్లో ఇవేంకూతలు మీ శ్రాద్ధపుకూతలు?" అని కొద్దిగా కూకలేస్తూ హెచ్చరించాడు. తను మేష్టరుగనుక అవన్నీ పడితీరాలి అనుకోని గావును వెంకటాయిగారు అవన్నీపడి, "అయ్యా! స్కూళ్ళ పెద్దతణిఖీదార్ని మేం తద్దినం అనీ, తరవాత ఆయన్ని మాసిగం అనీ, మరీ మైనరుతణిఖీదార్ని కాళ్ళకడగడం అనీ సం

భాషణలో చెప్పగుంటూంటాం. తద్దినపుబాధ అస్మదాదులైన అల్లుళ్ళకి లేకపోబట్టి నేను పైరీతిగా ప్రశ్నించాను. వారు మాకు పిత, పితామహ, ప్రపితామహాలాంటివారు. ఇదీ సంగతి!'' అని చెప్పి, "కుర్రాడా, పదరోయ్!" అని కేకేసి పైమీది కోల్లాయి నడుంకి పట్కాలాగ బిగించి, ఆమాంతంగా ఎగడి, "ముందు సూచించకుండా వచ్చాడు, ఈకొత్తవాడికి ఇదోరోగం గావును" అని అనుకుంటూ ఉడాముల మీద స్వగ్రామం జేరుకుని, పరిగెత్తే అవస్థలోనే బొట్టు గిల్లేసుకుని, జుట్టు రక్కేసుకోని, తమయింట్లోకి అడుగెట్టి "గాల్లొండి వంట కానీవమ్మోయ్!" అని పిన్నత్తగారి చెవులో ఉరిమి, బయటికి ఉరికి, తెంపుగుని పడ్డట్టు స్కూల్లోకి దూకి ఆ బొజ్జాయన అధికారి అయి ఉంటాడుగదా అనుకుని, ఆయన పాదపద్మసన్నిధిని గాళ్ళుపుకొట్టి గుడ్లు తేలేసి నోరు వెళ్ళబెట్టి కర్రలా బిగుసుకుపోయినట్టు పడిపోయాడు. ఈ అల్లరంతా నిజమే అనుకుని నలుగురూ పోగై, "క్షణంలో వచ్చేది తెలియదుగదా!" అంటూ జాలిపడి ఓ పెద్ద చెంబుడు చన్నీళ్ళు వెంకటాయిగారి మొహాం మీద చరిచి, ఓ తవ్వాగిన్నెడు వేడి గంజ లోపలికి ఎక్కించగా, అప్పటికి ఆయన కాస్త కళ్ళువిడడి, పెదవి కదిపి, అధికారికేసి తిరిగి, "అయ్యా—తమరు—నందిపిల్లి—దార్ని—వస్తున్నారని—తెలిసి—అల్లా—వెళ్ళి—" అని చెయ్యూపుతూ, 'ఏమైతేం? క్షమించాలి!' అనిగొణగగా

అధికారి నిజంగా అతను గాఢపుదెబ్బ తిన్నా డనుకుని. "ఓ యెస్. క్షమించాన్లెండి. ఎండగదా ఎందుకొచ్చినశ్రమ మీకిది? మేం రామూ? బండీ పంపలేదని కోపగించే బాపతు కాదు మాది! ఫర్వాలేదు లేవండి!" అని అభయం ఇచ్చిన మీదట వెంకటాయిగారు లేచి. "తమకు వేళ దాటింది. దొరువుదగ్గర ఒళ్ళు తడుపుకుని మడికట్టుకోండి" అని ప్రార్థించగా, ఆయన "అట్లానే, కాలకృత్యాలు అయినాయి. ఇక లేవడమే. నా ఆలస్యంలేదు. కాని, నాకోసం తెగశ్రమపడి ఎక్కడలేనివీ పుట్టించుకొచ్చి విశేషయత్నం చేసేరుగనక! ఒక్కటి వద్దు. ఈపక్క ఊళ్ళో—ఏదదీ? (అని కళ్ళుమూసుకుని) దేవుడు చాలా మేలుచేస్తే, గోకారం! (కళ్ళు తెరచి) గోకారంలో నాకు పెట్టిన భోయినం ఏంభోయినమండీ! నాలుగుకూరలు, నాలుగు పచ్చళ్ళు క్షీరాన్నం, మాషచక్రాలు, అబ్బ, అబ్బ! యధావిధి! యధావిధి! అయితేం, నేను ఆదినించీ ఇంత జఠరాగ్ని జీర్ణపుష్టి ఉన్నఘటాన్ని గనక అట్టే చిక్కు లేకపోయింది. మరోనాదారి స్వరూపం అయితే ఈపాటి టిక్కట్టు పుచ్చుకోవలిసిందే, సరే, త్వరగా కానిండి నేను ఉండలేను" అనగా, "చిత్తం పచ్చడీ మెతుకులూనండీ, నాకేముందీ, కుటుంబీకుణ్ణి, రండి" అంటూ వెంకటాయిగారు అధికార్ని తిన్నగా తనఇంటికి తీసికెళ్ళి, ఆయన మొఖం ఇంకా ఏదో ఆలోచనలో ఉన్నట్టు కనిపెట్టి, "వస్తా" అని ఆయన

దగ్గిర ఒక్కమాటు సెలవుపుచ్చుగుని, "అబ్బాయి, పంతులుగారికి తుంగచాప వెయ్యి, చూస్తావేం!" అని కుర్రాణ్ణి కసురుగుని, లోపలికివెళ్ళి, ఒకపావుగంట తరవాత ఒకగిన్నె పట్టుకుని పైకివచ్చి, "వంటాలస్యం ఉండడి ఒక్కక్షణం. ఈ లోపులో తమరిది స్వీకరించాలి!" అని అది అక్కడ పెట్టగా, అధికారి "మీ కేమన్నా మతి చలించిందా ఏం!" అని గట్టిగా కోప్పడి, వెంటనే "ఏం తెచ్చారేమిటి!" అని నిమ్మళంగా కనుక్కున్నాడు. "అబ్బే ఒక సేరుపాలు మట్టి ఊడలంటివి—మరగకాచి, ఇంత మిరయప్పొడీ పటిగి పంచదార చూర్ణమూ రంగరించానండి. మాంచి పని చేస్తుంది. ఇదివరకాయన ఇదంతే చెవికోసుకునేవారు, మరోమాట చెప్పకండి, పుచ్చుగోండి" అని మేష్టరు పట్టుపట్టగా అధికారి అతిసిగ్గుతో అయిష్టంగా (విషం పుచ్చుగుంటూన్నట్టు అభినయిస్తూ) నిమిషంలో గిన్నెలో తడేనాలేకుండా ఊడ్చి చేసి, పిదప నాలుగైదు నిమిషాలు కళ్ళుమూసుగుని ఆయాసం నటించి కళ్ళుతెరిచి, "అబ్బ!" అని,

అ—అయితే పంతులుగారూ!

వెం—చిత్తం!

అ—వంటాలస్యం ఉండనే ఉందిగనక, ఈలోపున పోనీ నేను తలంటు అభ్యంతరం తీర్చుకుంటేం?

వెం—(మనస్సులో, "నాదుంప తెంపు, నీమొహం తగ,...... అనుకుంటూ) ఓమరీ మంచిదీ! తమ ఓపిక!

మంగల్ని పిలిపిస్తాను, అబ్బాయి, ఇల్లారా! (కుర్రాడు వస్తాడు)

అ—మంగలి ఏం లాభం! అంటుకునే వస్తువు లభ్యం కానప్పుడు!

వెం—ఏ వస్తువు?

అ—ఆవునెయ్యి! నేను గోఘృతంతోగాని అభ్యంగనం చెయ్యను. అల్పులు వాడుకునే తైలాలకి మెదడు మెతగ వాసన నా మెదడు కొనుక్కోవాలని పెద్ద పెద్ద కంపెనీల వాళ్ళు తన్నుకుంటున్నారు!

వెం—ఎవరుతన్నుకున్నా, సాయంత్రం ఊళ్ళో కనుక్కొని కాస్త కాస్తే పోగుచెయ్యాలండి.

కుర్రాడు—అమ్మకు పురుడొచ్చినతరవాత తాతయ్యగారి ఊరు పంపడానికి ఓ శేరు ఆవు నెయ్యి కొన్నావుగా నాన్నా! ఇంట్లో ఉంటేనే లేదంటావేం!

వెం—(కుర్రాణ్ణి చేగోడీ నమిలినట్టు నములు దాం అని మనస్సులో అనిపించినా పైకినవ్వుతూ) మరే రోవ్ ఇట్టేమరిచిపోయాను! (అని అధికారికేసి తిరిగి) మావాడికి, పాఠాలు తప్ప కడంవి అన్నీవ్యాత్కపిలిగా జ్ఞాపకం ఉంటాయండి, మాధర్మమా అని.

అని ఇంట్లోకివెళ్ళి, నెయ్యితెచ్చి, మంగల్ని పిలిపించి అధికార్ని తలంటుకి కూచోపెట్టి, దొరువునీళ్ళు తెచ్చి, నీళ్ళకింద మంటచేసి, నీళ్ళు ఆయన కోరినన్ని బాలింత

రాలికి పోసినట్టుపోసి, ఆయనచేత మొత్తానికి మడి కట్టించాడు.

ఈలోగా, అడక్కుండానే కుర్రాడు చెప్పినమాటల వల్లవంటచేసే ఆవిడ పేచీమనిషి అనీన్నీ, తన ఘ్రాణేంద్రియ సాహాయ్యంవల్ల తయారవుతూన్న పిండివంటల స్వభావమున్నూ అధికారి పసిపట్టి, పొట్టనాసుగుపోకుండా బట్ట కొంచెం వోదులు చేసుగుని వీధిఅరుగుమీద పచారు చేస్తున్నాడు. వెంకటాయిగారువచ్చి: "పీటా అదీ వేశారు, రండి" అని అధికార్ని పిలిచాడు. "మనికి, అల్లాంటివిలేవు వడ్డించెయ్యమనండి" అని అధికారి వడ్డనకి హుకుం ఇచ్చాడు. మేష్టరు మళ్ళీ లోపలికెళ్ళి ఒక్కక్షణంలో పైకొచ్చి, "వడ్డన అయిది, రండి" అని అధికార్ని లోపలికి తీసుగువెళ్ళేసరికి, అధికారి నిర్జీవుడైపోయినాడు. అనగా, మరేంలేదు, విస్తరి కేసి చూసేసరికి గుండె ఝల్లుమని పోయింది. దాల్లో, బకాసురుడికి తోడినట్టు కుంభం మట్టుకు తోడి ఉంది. దానీ అగ్ర మందు—సార్వాగడ్డికొంప మీద కొండముచ్చు మొహంలాగ—వెక్కిరిస్తూ ఉస్తికాయంత ఉసిరీపచ్చడిఉంది. అధికారి, అంతమనిషీకూడా, వట్టి పాకం చలిమిడి అయిపోయి ఆపీటమీద కూలబడి, మరోటేమీ అనలేక 'మీరో మరీ!' అన్నాడు వెంకటాయిగారు, "నేను తరవాత కాని స్తాన్లెండి, ముందు తమరు పుచ్చుగోండి ప్రొద్దుపోయింది. ఏమీ అన్టేచెయ్యలేకపోయాం. నిమ్మళంగా కూచోవాలి—

కావలిసినివి నాతో చెప్పి వడ్డించుకోండి, అవిడికి చెముడు" అని మనవి చేసుకున్నాడు. అధికారి కళ్ళకిళ్ళతో పరిషించి, విస్తరి చూపిస్తూ, "ఎల్లా నేనిది ఏడవడం?" అన్నాడు. తక్షణమే, వెంకటాయి గారు, సిరుదు తనకి తెక్కువగ్రాంటు మాత్రమే రాగలదని పైనించివచ్చిన ఆర్డరు కాగితం తెచ్చి అధికారి మొహం మీద పెట్టి, "నేనెల్లా ఏడవడం ఇదీ! అని ఒకొక్క అక్షరమే ఉచ్చరించాడు. అధికారి ముక్కు మీద (ఎడంచేత్తో) వేలుపెట్టుగుని, "ఇదివరకు వాడికి ఏక దాహాంట, నేనూ విన్నా. అది తీరక చాలాచోట్ల ఇల్లానే చేశాట్ట నేను గ్రాంటు కురిపిస్తాను చూడండి. అన్నం పట్టుకు చెబుతున్నాను!" అని వెంకటాయిగారిని సముదాయించాడు. "అల్లాయితే రానీవమ్మా రానీ! ఆ పెద్ద విస్తరి ఇల్లా పెట్టు!" అంటూ వెంకటాయిగారు ముసలమ్మకి సంజ్ఞలు చెయ్యగా, ఆవిడ వేసివున్న విస్తరి పట్టుకుపోయి, తాజావిస్తరి తెచ్చి పెట్టింది. అధికారి మొఖవికాసంతో దంతపరిశ్రమ చేస్తూ రంగంలో ప్రవేశించాడు. నేతిగిన్నె పక్కనే ఉండడం ఇంటిదగ్గర అలవాటని ఆయన చెప్పడం వల్ల, వెంకటాయిగారు ఆవిడ చేత అల్లా చేయించడమే కాక, దొన్నెకుట్టివేసి, అందులోకూడా ఆద్యం ఉంపించాడు. చిటిగెలో అధికారి, గారెల పర్వంలోకి వచ్చాడు. మొదట్లో ఆవిడ రెండు పుంజీలుమాత్రమే వడ్డించింది. అవి జమిలిగా తింటూ, అధికారి, బొజ్జ ఎడంచేత్తో నిమురుకుంట్టూ,

అ—అబ్బ! ఏమిటో అనుకుంటూంగాని, భోజనం చెయ్యడంకూడా కష్టమేస్నోంది.

వె—అద్దమా! నా ఉద్దేశంకూడా అంతేనండి. నింపాదిగా కూర్చోండి. తమకు తెలియని దేముందీ! కోటివిద్యలూ కూటికొరకే!

పడపడి, ముసిలావిడ పళ్ళెంలో గార్లు మారు తెచ్చింది వేగినవి వడ్డించమని ఆవిడతో చెప్పమని అధికారి (అంగా స్త్రం పెట్టి ఎడంచేత్తో ముక్కు తుడుచుకుంటూ) కోరగా, వెంకటాయిగారు తన వేలితో పళ్ళెంలో వేగినగారెలున్న భాగం చూపించి, ఆప్రాంతానివి వడ్డించమని ముసలమ్మకి సంజ్ఞ చేశాడు. వేగినవి ఆ పళ్ళెంలో మరో ప్రాంతాన్ని ఉన్నాయని తన తాత్పర్యం అయినట్టుగా, ముఖంచిట్లిస్తూ అధికారి ఆభాగం చూపించాడు. వెంకటాయిగారు తనమాటే నెగ్గాలని తను మొదట చూపెట్టిన చోటే మళ్ళీచూపించాడు. ముసలమ్మకి ఈయొక్క వయినం బోధపడక, ఇవీ అవీ, మరి మిగిలినవీ కూడా అధికారి విస్తట్లో బోర్లించి, పళ్ళెం వెంకటాయి నెత్తి నెట్టికొట్టి "సత్రంబొక్కు జంతువుల్ని తీసుకు రావద్దని ఎన్నిమాట్లుచెప్పినా సిగ్గులేదు! మర్యాదట! తెచ్చి తెచ్చి ఎవణ్ణో సర్వభక్షకుణ్ణి తెచ్చావు! కుర్రాడికి ఒక్కటేనా లేదు. వాడికోసం మళ్ళీ వండి తగులడాలి!" అని సాదిస్తూ వంటింట్లోకి తుర్రుమంది. అధికారి, "ఈమెకి ఇంతకోపం ఏమిటండీ! నేను గనక సరిపోయింది. మరోళ్ళయితే తక్షణం లేచిపోదు రీపాటి! మీకు దెబ్బ తగల్లేదుకద! అని వెంకటాయిని ఓదార్చి, నిశ్శేషంగా గార్లు పుచ్చుగుని "మజ్జి

గలక్కర్లేదండి" అన్నాడు. వెంకటాయిగారు చాలా నొచ్చుగుని "అయ్యోకర్మమా! కోపం వచ్చినట్టుంది. మీా రేమీా అనుకోకండి. ఆవిడ స్వభావమే అంత" అన్నాడు. అధికారి "అందుకోసం కాదండీ. గార్ల తరవాత" పెరుగైనా సరే చేదే," అని లేచి చెయ్యికడుక్కుంటూ నేట్రెస్సు వేసుకోబోతూ "ఇక మనం బళ్లోకి వెడదాం. పిల్లల్ని పిలుచుగురండి. మీాకుర్రాణ్ణి ఇంతలో భంట్రోతుకి అన్నం పెట్టమనండి" అన్నాడు. వెంకటాయిగారు "చిత్తం" అని లేచి కోటు తొడుక్కుని పిల్లలకోసం వెళ్ళాడు. కుర్రాడు భంట్రోతుకి పీటవేసి వడ్డన ప్రారంభించాడు. అధికారి కోటు తొడుక్కుని, గుండీలు పెట్టుగుని, తలపాగా పెట్టుగుని "బాబోయ్!" అని కెవ్వున కేకెట్టాడు. "ఏమిటి! ఏమిటి" అని భంట్రోతు అడిగాడు. "తేలు తేలు! తలంతా అంటపొడిచింది. పాగాలో ఉంది గావును బాగా నొవ్వకుడుతోంది." అని కళ్ళు బిగించి మూలుగుతూ ఊరుకున్నాడు. తరవాత భంట్రోతు చెప్పిన మీాదట ఆయన పాగా తీసి దులపగా కప్పంత తేలు రాలింది. చెప్పుచ్చుగు కొట్టి కుర్రాడు దాన్ని చంపాడు. చంపి, "మా నన్నదగ్గిర ఉల్లిపాయితో చేసిన తేలుమందు ఉందండి" అని ధైర్యం చెప్పాడు. "అది ఒకవేళ వెల్లుల్లిపాయేమో నాకు సయించదు. నే నేసుగోను కుర్రాడా!" అని అధికారి డోక్కోడం ప్రారంభించాడు. భంట్రోతు కరువో కాలమో అన్నట్టు అన్నం అంతా రెండు ముద్దల్లో లాగుతూ, అధికారితో, "భయం లేదండి, అయ్యగారు! తలమీాద కుట్టడంవల్ల మర్రిపైకి

ఎక్కడానికి వీల్లేదు. తమరు వేపపుల్లా, గారె, లాటివస్తువులు వాడతారు గనక ఆ చేదుకి తేలు కాటు లోపలికి అసలు ఎక్కదు. మందు అనవసరమండి" అన్నాడు. వాడి తిండి అవుతూనే ఇద్దరూ స్కూలుకి పరిగెత్తారు. మేష్టార బ్బాయికూడా వెనకాలే వెళ్ళాడు. మరి కాస్సేపటికి కొంత మంది కుర్రాళ్ళని వెంటబెట్టుకుని మేష్టారు స్కూలు జేరుకున్నాడు. అధికారి పొట్ట వొదిలి తలపట్టుకుని ఆపసోపాలు పడుతున్నాడు.

మే—అదేమిటండి?

అ—తేలండీ!

మే—ఎక్కడా?

అ—తలమీద.

మే—మందు తెస్తూ?

అ—వద్దండీ. ఇప్పుడు సైము లేదు. అసలుపని పాడవుతుంది మందేస్తూ కూర్చుంటే!

అని మూలుగుతునే "చూడండీ! మేష్టారు!"

మే—చిత్తం!

అ—ఈ వేళ శుక్రవారం. నేను రాత్రి అన్నంతిననుు.

మే—దయచేసి చెప్పండి, ఏం తింటారో!

అ—ఇందాకటివే అయిదారు పెరుగులో పారెయించమని ముసలమ్మకి కబురు పంపండి.

మే—(తేలయేది జెట్టియేది ఆ మినప దినుసుమీద వీడి ఏవ అల్లానే ఉంది అని మనస్సులో అనుకుని) అవశ్యం!

అ—పైక్లాసువాళ్ళకి కూడా పుస్తకాలు లేనట్టున్నాయేం?

మే—ఈ మధ్య పెళ్ళి ఊరేగింపుకి పాలెం అంటుగుందండి. అప్పుడవి కాలిపోయి ఉంటాయి.

అ—సరే. అల్లాయితే నేను శాస్త్ర లోకజ్ఞానం పరీక్ష చేస్తాను. మీరు తప్పుకోండి. (అని కొంత మూలుగుతాడు. పిల్లలు కొంచెం నవ్వుతారు)

మే—చిత్తం.

అ—ఏయ్! విభూతి కుఱ్ఱాడు! మీ ఇంటిపేరు?

వి—గడ్డిల్లు.

అ—నీ కెన్నేళ్లుంటాయి?

వి—పెద్దవాళ్ళని కనుక్కోవాలి.

అ—నేను పెద్దవాణ్ణేనా?

వి—అవునండి.

అ—ఎంచేత?

వి—మీకు బొజ్జ ఉందిగా!

అ—("విషయం మార్చి ప్రశ్నలువేస్తే అసలు మాట్లాడరేమో వీళ్ళు" అని మనస్సులో అనుకుని) తరవాతవాడు! బొజ్జ ఎల్లా వస్తుంది?

త—గార్లు తింటేనండి.

అ—(మేష్టరుకేసి చూసి) మీస్కూల్లో అఖండులున్నార్లే!

మే—చిత్తం తమ దయ!

అ—మూడో వాడు! బూర్లు తింటేమాత్రంరాదూ?

మేస్టారి అబ్బాయి—(అడక్కుండానే) ఆవడలు తిన్నా వస్తుందండి.

అ—(కోపంతో) ఎవరండీ, ఈ పిల్లవాడు! మా చెడ్డవాడూ!

మే—చిత్తం క్షమించాలి. మా వాడేనండి.

అ—ఓహో! అవునండోయి. అయినా సరే అడక్కుండా సమాధానం చెప్పకూడదు. నేను కనక సరిపో యింది, క్షమించాను. (అని మూలిగి) నాలుగో వాడు! బొజ్జ యెందుకు?

నా—బండి యెక్కడానికండి!

ఆ—ఛీ! అయిదోవాడు!

అయిదో—పెద్ద పెద్ద కోట్లు కుట్టించుకోడానికండి!

అ—ఛీఛీ! ఆరోవాడు!

ఆ—ఆయాసంగా ఉంటూంటే చేతులు జేరవేసుగో డానికండి!

అ—టట్! అవేవీకావు. అందర్నీ కడుపులో పెట్టు గోడానికి. చాలు కాని, ఈ పుస్తకం తీసుకో! పైక్లాసులో మొదటివాడు! ఎక్కడేనా తీసి వాచకం కానీ!

మొ—(ఎదో తీసి) "ఆ ముని అంతట..."

ఆ—"ముని" అంటే ఏమిటి, రెండోవాడు!

రెం—మునిపండి.

అ—మరి నేను మునినేనా?

రెం—కాదండి.

అ—ఎంచేత ?

రెం—"ముని" అంటే మంచి మనిషండి.

అ—అక్కడితో ఆగు! మూర్తోవాడు! నువ్వు ఉత్తరం చూపెట్టు!

మూ—ఇంటిదగ్గిర ఉందండి.

ఆ—ఉత్తరపుదిక్కు లేకపోవడమేమిటిక్కడా! (అని పళ్లుబిగిస్తాడు).

మూ—అదాండీ! (అని ఇంటికప్పు చూపిస్తాడు)

అ—ఎవడా చెప్పింది ?

మూ—మా అన్నయ్యండి, మొన్న సెలవులకి వచ్చి మ్యాపులో చూపించాడు.

అ—విన్నాంగాని, మేష్టారూ, తమరు కొంచెం గజ్జె కట్టండి. విందాం.

మే—చిత్తం! తమకు బాధ తగ్గిందాండి ?

అ—చిత్తం! నా గోడ వెందుకు, తమరు ఉపక్రమించండి!

మే—ఎంతమాటన్నారు! అల్లానే. బాలులారా! (అని గొంతుకసద్దుకుని) సూర్యుడు భూమిచుట్టూ గిరగిర గిరగిరా తిరుగుచున్నాడు.

అ—అదేమిటయ్యా, అబద్ధాలూ!

మే—ఆ మాటకొస్తే మీరు చెప్పండిచూస్తాను! ఏం ఎక్కువచెబుతారో మహా! ఇందాకణ్ణించివిన్నాగా నేనూను!

అ—స్మృతిమీరి మాట్లాడకండి!

మే—అయ్యా, పిల్లలుగలవాణ్ణి! పెద్దలనాటి నించీ ఇంతే! పైగా నాకు సర్వీసు అయిపోతోంది. ఇహాతప్పుగోమని ఊళ్ళోవాళ్ళూ అంటున్నారు, (కోపంగా) పైన మీచిత్తం!

అ—పిల్లలుగలవాడవైతే మాత్రం, తల్లకిందులు చదువా చెప్పేది?

మే—మనవిచేశాగా! అల్లాయితే బాలులారా భూమేట సూర్యుడిచుట్టూ తిరుగుతూంట! విన్నారా? గిర గిరా!

అ—ఇదేమిటి! నమ్మకం ఇంతట్లో ఎల్లామార్చుకున్నావు? మళ్ళీ అప్పుడే భూమి గిరగిరా?

మే—అయ్యా! నా జీతం రాళ్ళునాలుగూ గిరగిరా తిరిగి వస్తూంటే నాకు చాలు.

అ—నాకూ అంతే.

మే—బాగా అన్నారు! మీకడుపు చల్లగా! అల్లాంటప్పుడు దేంచుట్టూ ఎవరు తిరిగితే, ఎవడికొంప ఏం మునిగిపోయింది చెప్పండి! పైగా ఎవరిచుట్టూ ఎవరుతిరిగినా, లెక్కల్లో తేడా లుండవని మా పంచాంగంశాస్త్రుల్లుగారన్నాడు. మీతో నేను ఏకీభవిస్తూనే ఉన్నానుగాని స్వల్పాల్లో నాతో పట్టింపులు పోకండి ఊరికేను.

అ—సరే లెండి.

అని అధికారి రాయుడం అభినయించి, తానిదివరకే రాసి గోప్యంగా తెచ్చిన కాగితపుముక్క ఒకటి పైకితీసి, అసలు రిపోర్టు తరవాత పంపుతాననిన్నీ అది ఎల్లా ఉండ

వచ్చునో మచ్చు చూపించుతున్నాననిన్నీ చెప్పి, తను ఈ సంగతులు మహా, అప్పుడే రాసినట్టు చదివాడు.

"మనోగణితము మోతాదు. లెక్కలు సుమారు. తెలుగు జబ్బు. నల్లబల్ల నల్లగానూ లేదు, బల్ల పరువుగానూ లేదు. అది ఘోరమరమ్మతు కోరెడిని. స్కూలులో స్వేచ్ఛ దేశీయక సరతుసున్న. బోధనా పరికరములు శూన్యము. ఉక్తలేఖనము తప్పులకుప్ప. చూచి వ్రాతలో శ్రద్ధ మిళితమై లేదు. చూచివ్రాతలో చూచుటయు వ్రాయించుటయు, దిద్దుటయు ముఖ్యములు. చిత్రలేఖనము ఎంతైన వృద్ధికి జాగా ఒసంగుచున్నది. నేను, అందరికీ తెలిసిన విషయము ముగురించి, రమారమి ఒక మాదిరి పాఠమిస్తిని. పిల్లలు పద్యములను అర్థమగునట్లు చదవకూడదు. గొంతెత్తి పాడవలెను. ఉపాధ్యాయుడు పిల్లలను పోగుచేసికొని వచ్చినట్లు కన్పింపదు."

మే—తమరు చదివిన వాటిల్లో చాలా ఇప్పుడు జరగనే లేదే?

అ—ఆమాత్రం నాకు తెలియకపోలేదు. నాఉద్దేశం ఏమిటంటే, ఒకవేళ అవికూడా జరిగిఉంటే వాటివిమర్శ ఇల్లా ఇల్లా ఉంటుంది సుమా, కబడ్దార్, అని.

సరే పిల్లలకి రేపు సెలవని చెప్పి పంపించెయ్యండి.

మే—చిత్తం. కొంచెం వీళ్ళని ప్యాసుచేసి మరీ వెళ్ళరూ?

అ—ఓ యస్. సరే. పెద్దక్లాసు ఎందరూ?

మే—ముగురు.

అ—సరే ముగ్గురే గనుక అంతా ప్యాస్. చిన్న క్లాసు చాలా ఉన్నారా?

మే—మరేనండీ! చిక్కొచ్చింది!

అ—టీకాలు వీళ్ళల్లో ఎవరికి లేవో, చెప్పండి!

మే—ఆ వీభూతి గ్రాడికి లేవండి.

అ—ఇహ నేమ్మరి! వాడు తప్ప చిన్నక్లాసంతా కుడా ప్యాస్!

పిల్లల్ని పంపించేసి, స్కూలుకట్టేసి, అంతా మేష్టరు గారి ఇల్లు జేరుకున్నారు. క్రమేణా చీకటి పడింది. అధికారి ఆఫడల్ని పరామర్శచేశాడు. చేస్తూ, మేష్టర్ని పిల్చి, "నైటు స్కూలు గ్రాంటుకూడా మీరు లాగుతూన్నట్టున్నారు. నైట్ స్కూలికి పదండి చూద్దాం" అన్నాడు. అందుకు, మేష్టరు, "చిత్తం. నైట్‌స్కూలనే పదార్థం తమ కటాక్ష వీక్షణంతో కూడుకుని ఉండేదే గాని వేరే ఉంటు దని చూస్తున్నారా యేమిటి? ఇప్పుడు తమరు దయచెయ్యగా ఈ పగటిస్కూలు నివేదించు గున్నాడా, ఈ విధేయుడు! ఈ మాటు తమరు వేంచేసి నప్పుడు అక్కడికి ఆకాస్తమాటా దక్కించుకుని ఆనైట్‌స్కూలుని కూడా తమ ఎదట దాఖలు చేసుగుంటాడు!" అంటూ విధేయతతో దాటుకున్నాడు. అధికారి 'బేవ్' మని త్రేన్చి చిరునవ్వునవ్వి, "మాట తప్ప కండి" అని హెచ్చరించాడు. మేష్టరు నాలిక కరుచుకుని "అంతే! సెబాసు" అన్నాడు.

మరి కాస్సేపటికి మేష్టరు అధికారి దగ్గిరికి వెళ్ళి "ఇక నేను పడక 'అరణ్యమెంటు' చేస్తాను" అన్నాడు. తక్షణం

ఛంట్రోతు వెంకటాయిని వీధిలోకి పిల్చుకుపోయి కొంత సేపు చెవిలో ఏదో ఉపదేశించాడు. వెంకటాయిగారు, "తప్పుతుంది బాబూ, అల్లానే!" అన్నారు. ఛంట్రోతు "తొమ్మిది దాటకూడదు, దాటితే మళ్ళీ పంతులుగారికి భయం. భయం అంటే మనుష్యుల్ని గురించి కాదు. పురుగూ బుట్రా ఉంటుందని!" అన్నాడు. వెంకటాయిగారు "అల్లాగే వెళ్ళివస్తా!" అని కండువా వేసుగుని ఎక్కడికో వెళ్ళాడు.

ఆయన వచ్చేసరికి వీళ్ళు లేరు. నిద్రపోతూన్న కొడుకుని లేపి వెంకటాయిగారు అడగగా వాడు ఏమీ ఎరగనన్నాడు. ముసలమ్మ సమాధానం గ్రహించేసరికి తెల్లారుతుందేమో అని భయమేసి వెంకటాయిగారు ఆవిణ్ణి అడగనేలేదు. ఆరాత్రి వెంకటాయిగారికి నిద్రపట్టలేదు.

మర్నాడు టపాలో వెంకటాయిగారికి మరి నాలుగు రోజుల్లో ఆ స్కూలికి తణిఖీతంతూ జరుగుతుంది. గనక సిద్ధంగా ఉండవలెనని అసలు అధికారి దగ్గిర్నించి ఉత్తరం వచ్చింది!

సంపూర్ణము